స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్చమైన చిరునామా...

వెల కట్టలేని
మీ ఆనందానికి
15 రూపాయలు
ఓ లెక్కేనంటారా?

# హాస్యానందం

సంపూర్ణ హాస్య మాస పత్రిక

ఫిబ్రవరి-2013
₹15/-



చంద్ర
స్పెషల్



స్వచ్ఛమైన చిరునవ్వుకి... అచ్చమైన చిరునామా...



సంపూర్ణహాస్య మాస పత్రిక

ఫిబ్రవరి-2013


| | |
|---|---|
| Publisher&Editor | : Ramu.P |
| Associate Editor | : Sudharani.P |
| Cartoon Editor | : A.V.M |
| Well Wishers | : Tanikella Bharani<br>Jayadev<br>Mallik |
| Full Pillar | : Bnim |
| Designing | : Creative Graphix |
| Creative Team | : Tumbali Sivaji<br>T.Chandra Sekhar<br>Rampa<br>Surya Dubey<br>P.V.Narayana<br>Ramsheshu<br>P.Priyatham<br>Mallikarjun.U |
| Helper | : Raviteja.S |



| | |
|---|---|
| Address | : HASYANANDAM,<br>#8-215/4,<br>Near Ramalayam,<br>Po:YERRABALEM<br>Pin 522 503,<br>Mangalagiri Mandal,<br>Guntur dist. |
| Ph | : 9849630637 |

email: hasyanandam @yahoo.com



| | |
|---|---|
| Hyderabad & Telangana Marketing | : Charminar News Agency,<br>1-6-176/1, M.G.Road,<br>Khandaji Bazar,<br>Secunderabad-3.<br>Ph:9346515813 |
| And | : Shams News Agency,<br>Abids, Hyderabad.<br>Ph:040-30680840/41 |




## హాయ్... సానందంగా...

హాస్యాభిమానులకు, హాస్యానందం ఆప్తులకు,
కార్టూనిస్టులకు, పాఠకులకు హాస్యాభివందనాలు!

ముందుగా మనందరికీ ఇష్టమైన మన 'బొమ్మర్షి' బాపుగారికి 'పద్మశ్రీ' వరించినందుకు ఆయనకు అందరి తరఫున హృదయపూర్వక శుభాకాంక్షలు!

ఇక ఈ సంచిక విషయానికొస్తే గమనమే గమ్యమై సాగుతున్న మన హాస్యానందం మన తెలుగు తేజాలపై పూర్తిగా ఒక ప్రత్యేక సంచికను రూపొందించటం ఆనవాయితీగా పెట్టుకుంది. ఆ పరంపరలో ఈ సంచిక మన ప్రఖ్యాత చిత్రకారులు, కార్టూనిస్ట్, రచయిత, కవి అయిన శ్రీ చంద్రగారి స్పెషల్ సంచికగా రూపొందించాం!

కొంతమంది 'ఇప్పుడు సందర్భం ఏమిటి?' అని అడిగారు. దానికి మాదొక్కటే సమాధానం...మన విశిష్ట వ్యక్తుల 'విశిష్టత' చెప్పడానికి ఒక సందర్భం అవసరమా! మనకి సమయం అనుకూలించాలి గాని!
తవ్వినకొద్దీ ఊరే నీటిలా అన్వేషించిన కొద్దీ మాకు లభ్యమయిన ఆయన 'కళారూపాలు' ఈ 48పేజీల్లో నర్తనానికి నానా అవస్థలూ పడి... కొండని అద్దంలో చూపించిన విధంగా రూపొందించామని అనుకొంటున్నాం

ఈ ప్రత్యేక సంచిక రూపకల్పనలో మాకు సహకరించిన మిత్రులందరికీ పేరు పేరునా కృతజ్ఞతలు తెలుపు కుంటున్నాము.

శ్రీ చంద్రగారు మరిన్ని అపూర్వకరమైన బొమ్మలు, కార్టూన్లు, రచనలు చేస్తూ... ఆయురారోగ్యాలతో హాయిగా ఆనందంగా ఉండాలని దేవుణ్ణి హాస్యానందం ప్రార్థిస్తోంది. అందరూ నవ్వుతూ... ఆరోగ్యంగా... ఆనందంగా వుండాలని కోరుకుంటూ...

-రాము.పి
(ఎడిటర్)

Smile in Every Page... Satisfaction in Every Smile









## ఎక్కడ ఏ నవ్వులున్నాయో....





అట్టహాసిని:
కృతి ఖర్‌బందా
కార్టూన్: చంద్ర

## మన జనాలు






రూపంలో హీరోలాంటి ఫేసు
బొమ్మల్లో నికార్సయిన ఫోర్సు
మాటల్లో తియ్యటి తిరకాసు
కానీ...స్నేహంలో అందరికీ ఇస్పేటాసు

-కె.వి.భీమారావు, హైదరాబాద్

# శ్రీతలిశెట్టిరామారావు జయంతి
# మే20న
# తెలుగు కార్టూనిస్టుల దినోత్సవం సందర్భంగా

ఆంధ్రప్రదేశ్ కోక్విల్ అకాడమీ,
ముఖీమీడియా,
హాస్యానందం,
సంయుక్తంగా నిర్వహిస్తున్న

**ఈ పోటీలో కార్టూనిస్ట్ అందరికీ ఆహ్వానం!**

ప్రథమ బహుమతి:
రూ.2000/-లు

ద్వితీయ బహుమతి:
రూ.1000/-లు

విశిష్ట బహుమతులు (10):
ఒకోక్కటి రూ.200/-లు

ఇంకా ఎన్నో ప్రశంసా పత్రాలు...

నిబంధనలు:

1. కార్టూన్ A4 సైజ్‌లో తప్పనిసరిగ్గా వుండాలి. సబ్జెక్ట్ మీ ఇష్టమే!
2. ఒకరు 4 కార్టూన్లు మాత్రమే పంపాలి.
3. కాప్షన్‌లెస్ కార్టూన్‌లైతే మరీ మంచిది.
4. సెలక్ట్‌కాని కార్టూన్లు తిరిగి పంపగోరువారు తగిన స్టాంపుల కవరు జత పరచాలి.
5. పరిశీలనలో వున్నవి, కాపీ కార్టూన్లు పంపవద్దు.
6. మీ పూర్తి బయోడేటా ఫొటోతో సహా తప్పనిసరిగా జత చేయాలి.

**ఈ సందర్భంగా హాస్యానందంలో ప్రచురించిన ది బెస్ట్ కార్టూన్స్ ని పుస్తకంగా విడుదల చేస్తున్నాం!**



కార్టూన్లు మాకు చేరడానికి ఆఖరుతేదీ:
**20.3.2013**

కార్టూన్లు 'హాస్యానందం' చిరునామాకు మాత్రమే పంపవలెను.

# ఆ టాపిక్! -ఈ కార్టూన్

తెలుగు కార్టూనులలో పనిపిల్లలందరూ అందగత్తెలు. వాళ్ళ కట్టు, బొట్టు, వయ్యారం, సింగారం అనాదిగా వస్తున్న ఆచారం.

అందుకే ఇంటి యజమాని చొంగలు కారుస్తాడు.

అతడి పెళ్ళాం కస్సు బుస్సు మంటుంది.

ఈ మూడు క్యారెక్టర్లలో రకరకాల కాంబినేషన్ పర్ముటేషన్లతో మన తెలుగు కార్టూనిస్టులు ఎక్స్‌పెరిమెంట్లు చేశారు.

ఈ మూడు క్యారెక్టర్లలో ఒకటి తీసేద్దామనుకోండి... హాస్యం పండించాలంటే వ్యాఖ్య తెలివిగా రాయాలి. కార్టూనిస్టుకి ఇది పెద్ద ఛాలెంజ్ అనే చెప్పాలి.

ఆ ప్రయత్నంతో గీసిన కార్టూన్ ఇది.




## గీతల్లో కితకితలోళ్ళు...



తాను చెక్కిన చుక్కల నడుమ 'రమణీయమైన చంద్రుడు
పత్రికా గగనంలో మెరిసే వి'చిత్ర'మైన చంద్రుడు
చిత్రరచనారంగంలో వెలసిన వెన్నెల చంద్రుడు
గీసి రాసి రాసి గీసి వాసికెక్కిన వన్నెల చిన్నెల 'చంద్ర'భానుడు.

గీ: శంకర్ నారాయణ ✦ రా: బి.ఎమ్.పి.సింగ్






జనవరి 2013 నెల హాస్యానందం అందింది. కథలు, కార్టూన్లు ఎప్పటిలాగే బాగున్నాయి. చాలామంది కార్టూనిస్టులని ప్రోత్సహిస్తున్న మీకు ప్రత్యేక అభినందనలు. రాంపాగారికి షష్టిపూర్తి శుభాకాంక్షలు. పబ్లిక్‌టాక్ పేర మీరు అందిస్తున్న సినిమా రివ్యూలు నిష్పాక్షికంగా వున్నాయి. మిథునం సినిమా, సంక్రాంతికి విడుదల అయిన పెద్ద సినిమాల కన్నా ఎంతో బాగుందన్న టాక్ వైజాగ్‌లో వినిపించింది. అయితే పబ్లిసిటీ అంత పెద్దగా చిన్న సినిమాలకి రావడం కష్టంకదా. వచ్చేనెల 'చంద్రగారి స్పెషల్‌గా రావడం ఆనందదాయకం.

**-పొర్లుంది వెంకట రామశర్మ, కార్టూనిస్ట్, విశాఖపట్నం.**

తల ఎత్తుకుని బ్రతికే లైఫ్‌స్టైల్ చక్కగా సంపాదకీయంలో మలిచారు. అంజలి ముఖచిత్రం అద్భుతంగా ఉంది. బోసినోటి నాన్నను టూత్ పేస్ట్‌తో వ్యాఖ్యానించడమా! వెల కట్టలేని మా ఆనందానికి పదిహేను రూపాయలు ఒక లెక్క కాదని మనవి చేసుకుంటున్నాను.

**-వాస్తురామచంద్ర,నెల్లూరు**

జనవరి హాస్యానందంలో ప్రచురించిన సంపాదకీయం చాలా బాగుంది. అప్పటి మన 'లైఫ్ స్టైల్'ని ఎలా మలచుకోవాలో సూటిగా చెప్పిన ఎడిటర్‌గారికి అభినందనలు. ఈ సంచికలో ప్రచురించిన కథ-మేరేజస్ ఆర్ మేడిన్ బ్యూరోస్' చాలా బాగుంది. నేటి పెళ్ళి పద్ధతిని ఎండ గట్టింది. రచయితకి మా అభినందనలు.

**-శ్రీవాణి.ఎమ్.పాలకొల్లు**

అంజలి ముఖచిత్రంతో వెలువడిన జనవరి హాస్యానందం చూడముచ్చటగా ఉంది. పత్రికని అందంగా తీర్చి దిద్దుతున్న మీ అభిరుచికి అభినందనలు. ఈ సంచికలో ప్రచురించిన కార్టూన్లు చాలా బాగున్నాయి. ముఖ్యంగా మధ్యపేజీల్లో ప్రచురించిన 'కార్టూనస్త్రాలు' నిజంగా వాడిగా ఉన్నాయి. **-జి.సుధాకర్‌బాబు,తిరుపతి**

హాస్యానందం అభిమానినైన నేను చంద్రగారి వీరాభిమానిని! ఆయన గురించి ప్రత్యేక సంచిక అన్న వార్త చదవగానే నెలరోజులు ఇంకా ఎదురు చూడాలా అనే దిగులుతో కాలం గడుపుతున్నాను. ప్లీజ్... తొందరగా ఫిబ్రవరి సంచిక విడుదల చేయరూ! చంద్రగారి బొమ్మలు, కార్టూన్లు ఎప్పుడెప్పుడు చూద్దామా అని ఆత్రంగా ఉంది.

**-ఊపూరి రాజశేఖర్,గుంటూరు**

హాస్యానందం జనవరి సంచిక చాలా బాగుంది. ఇందులో ప్రచురించిన కథలు, కార్టూన్లు చాలా బాగున్నాయి. నాటి నవ్వులు శీర్షికన ప్రచురించిన ఎక్కి నటరాజు కథ నేటి మన నాటకాల దుస్థితిని కళ్ళకు కట్టినట్లు చూపారు రచయిత. అలాగే నేటి మన పెళ్ళిల వ్యవహారం ఎలా ఉందో మ్యారేజస్ ఆర్ మేడిన్ బ్యూరోస్ కథలో చాలా చక్కగాఎస్టాబ్లిష్ చేసిన రచయితకు మా అభినందనలు.

**-పి.జయశ్రీ, విశాఖపట్టణం**

హాస్యానందం మా ఇంటిల్లిపాదికి అభిమాన పత్రిక అయిపోయింది. పేజీలు ఇంకా ఎక్కువ ఉంటే బాగుండేది అనిపిస్తోంది.

**-ఆర్.మంజుల, విశాఖపట్టణం**

మా నవ్వులకు కేరాఫ్ అడ్రస్ అయిన హాస్యానందం ఎల్లప్పుడూ ఇలానే హాస్యం పండిస్తూ...మాకానందాన్ని పంచాలని మా కోరిక. ప్రతి పేజీ నవ్వులతో నవ్వులు పూయిస్తున్న రచయితలకు, కార్టూనిస్ట్‌లకు మా అభినందనలు. **-ఆర్.శ్రీహర్ష,హైదరాబాద్**

జయదేవ్‌గారి ఆ టాపిక్-ఈ కార్టూన్లు, మల్లిక్-కామెడీకథలు, క్లిం-రింగిల్... రింగిల్... దయాకర్-శీనుగాడు...మన కార్టూనిస్ట్‌ల కార్టూన్లు హాస్యానందాన్ని అందరికంటే భిన్నంగా నిలుబెడుతుందనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. మీ కృషికి మా అభినందనలు. కలకాలం మన హాస్యానందం ఇలానే కొనసాగాలని నా ఆకాంక్ష!

**-జి.గణేష్, నెల్లూరు.**



# నాకు అర్థంకాని చంద్ర

-బ్నిం

గుట్కా గుంభనం ఓ పట్టాన ఇష్టపడని చంద్ర అప్పుడప్పుడు బాపుగార్ని తప్ప ఎవర్నీ మెచ్చుకున్న దాఖలా నాకు దొరకలేదు.

వీలైనంత తక్కువమందిని తిట్టిపోద్దామని రోజూ భీషణ ప్రతిజ్ఞ చేసుకున్నట్టుండే ఈ అంతర్ముఖుడు చాలా దగ్గరకెళ్ళిన ఏ కొద్ది మంది స్నేహితులలో నిజనైజం తెల్సుకో గల్గుతారు. ఖర్మ ఏమిటంటే ఆ పరమ మిత్రులకీ ఈయనకీ బద్ధ శత్రుత్వం.

చంద్రకి కోపం, కసి, పట్టుదల ఎక్కువ అని మనందరికన్నా ఆయన పట్టుకున్న పెన్సిలుకీ బ్రష్‌కీ తెల్సు!

అందుకే ఆయన చెప్పినట్టు అవి చచ్చినట్టు వింటాయి. కొన్నాళ్ళు విశ్రాంతి లేకుండా బొమ్మలేసి.. ఢమాల్‌మని రిలాక్స్ అయి పోతాడు. ఈ మధ్యలో మళ్ళా విశ్రాంతి లేకుండా పని చేయాల్సినన్ని పనులు పోగేసుకుని వర్క్‌లో పడతాడు.

అప్పుడు దించిన తల... బొమ్మలన్నీ రెక్కలు కట్టుకుని వెళ్ళిపోయాక లేస్తుంది. (లెక్కలు ముట్టాయో లేదో ఆయనకీ బొమ్మలకీ కూడా తెలీదు) బొమ్మలు బాగా కుదిరాయని తృప్తిగా రిలాక్స్ అవుతాడు.

మళ్ళీ రిలాక్స్ నుంచి రీ ఆర్గనైజ్ అవ దానికి... షరా మామూలే.

అచ్చం చంద్రుడిలా... రైజింగ్... రిలాక్సింగ్ ఫిఫ్టీ(స్) ఫిఫ్టీ(స్)! ఆయనకి పనిచ్చి ఇరుకున పడ్డవాళ్ళు "ఎప్పుడు వేస్తాడో... ఎప్పుడిస్తాడో..."అర్థంకాని అయోమయాన్ని సణుక్కుంటూ ప్రదక్షిణలు చేస్తుంటారు.

ఓ అర్జెన్సీలో పుస్తకం వేద్దామనుకున్న వాడు... "అన్నా... చాలా అర్జెంటే..." అని పని అప్పజెప్పి ఒట్టేస్తే... కూచోపెట్టి ఓ సిగిరెట్ పూర్తయ్యే వ్యవధిలో బొమ్మేసి ఇచ్చేస్తాడు. (అది అర్జెన్సీకి కూడా ప్రింట్ కాక పోతే... ఆర్టిస్ట్‌కి కాకరే గదా మరి...)

బొమ్మేసి పెట్టమంటే కథ చదివి పెదవి విరిచేసి రాసిన వాళ్ళనీ, అచ్చేస్తానన్న పత్రిక వాళ్ళనీ తల్చుకుని జాలిపడుతూ... తరచుగా తిట్టిపోస్తూ 'నీ పని నువ్వు చెయ్యవయ్యా మహానుభావా!' అని తిట్లు తింటూ... దణ్ణాలెట్టించుకుంటూ... చెట్టెక్కి కూర్చుని... దిగిరాడు... దిగిరాడు.

'బాపుబొమ్మలతో...' అని పబ్లిసిటీ ఇచ్చినట్టే పబ్లిషర్స్ 'చంద్ర ముఖచిత్రాలతో' అని ప్రకటనలిచ్చే స్థాయిలో తనని తోసి... నిలబెట్టేసి... తన తపస్సులో తాను వుండే చంద్ర మనకి అర్థం కాడుగానీ...ఆయన బొమ్మలు మాత్రం చక్కగా అర్థం అవుతాయి...

చక్కటి రూపు 'రేఖా' విలాసాలతో కలర్‌ఫుల్‌గా వుంటాయి.

బొమ్మల్లో అమ్మాయి వుంటే... నా సామి రంగా... 'నన్ను చూడు.. నా అందం చూడు' అన్నట్టు రెచ్చగొడుతూ నిల్చుంటాయి... పిలుస్తాయి. పిచ్చెక్కిస్తాయి.

సోషల్ కథల్లో సైన్సు పాఠాలుంటాయి..

జానపదాల్లో ప్రబంధాలుంటాయి.

కార్టూన్స్‌లో యమా తెలివి తేటలుంటాయి.

ఆయిల్ పోర్ట్రైట్‌లో జీవకళలుంటాయి.

అదపా దడపా రాసిన కథల్లో... నిజాలూ కమ్యూనిజాలు వుంటాయి.

ఈనాటివాడా... ఈయనగారు...

బాపుగారికి కొంచెం వెనక్కాలే వున్నా ఆయన వేసుకుంటూ వెళ్తున్న రోడ్‌ని రన్‌వేగా మార్చుకుంటూ ఆర్ట్ స్టార్ట్ చేశాడు.

ఆ అనుభవం 65లో 15 తీస్తే వున్నంత వుంటుంది. చంద్రగారికీ నాకూ పరిచయం తక్కువ. స్నేహాలు ఎక్కువ.

నన్నాయన ప్రేమిస్తాడు!!

నేనాయనకి భయపడతాను! ప్రేమించను!!

మొహమాటానికైనా మెచ్చుకోదని నాకు... కొంచెం 'ఇది' వుంది! అది మనఖర్మ.

ఆయనకి నిజం చెప్పడం ఒకటే వచ్చు!!

యదార్థవాది... ఎలాగా బంధువిరోధి కదా!

ఆయనకి చాలామంది బంధువులే!

కొంతమంది స్నేహితులున్నారు కానీ...

మొదట్లో చెప్పినట్టు ఈయనకి వాళ్ళంటే పడిచావదు!

ఐతే... వాళ్ళు ఈయనంటే పడిచస్తారు.

అచ్చం నాలాగే...

(ఏం రాయదల్చుకున్నావ్‌రా నా గురించి అని ఆయన నన్ను నిలేస్తే... "మీకు అర్థం కాదులెండి" అంటా! ఆయన నాకు అర్థం అయ్యాడు గనకనా...???)





చంద్రకోసం




అలా సగమే ఊదకూడదోయ్- పూర్తిగా ఊదాలి!




ఏమండీ- మనకొంపెవడో దోచుకు పోయాడండీ!




సుశీ- అది ప్లాస్టిక్ మొక్కని జ్ఞాపకం...!




నో - నాకు ఆడుకోటానికి కుక్కపిల్లే కావాలి!
2
ప్రసూతి వార్డు



# మల్లిక్ కామెడీ కథలు

## దొందూ... దొందే...

సుశీలా, కాంతారావు ఇద్దరూ ప్రేమించు కుంటున్నారు.

దాదాపు సంవత్సరం నుండీ కిందా మీదా పడిపోతూ చాలా గాఢంగా ప్రేమించు కుంటున్నారు.

ఆ రోజు...

వాళ్ళిద్దరూ పార్కులో ఓ మూల ఓ పొద వెనకాల కూర్చున్నారు.

"సుశీ..." ప్రేమనంతా గొంతులో పలికిస్తూ అన్నాడు కాంతారావు.

"ఏంటి కాంతా..." అంతకు రెట్టింపు ప్రేమను గొంతులో పలికిస్తూ అంది సుశీల.

"నువ్వెంత అందంగా వున్నావో?!..." మీది గడ్డేసుకుని సుశీల వంక చూస్తూ అన్నాడు కాంతారావు.

"గిలి... గిలిగిలిగిలి... గిజ్జాలి గిలిగిలి" ఊగిపోతూ నవ్వింది సుశీల.

"హావ్వో... హావ్వో... హావ్వో..." కాంతారావు పార్కుపచ్చికమీద అటూ యిటూ పాకుతూ వెతకసాగాడు.

"ఏంటి కాంతా... ఎంటలా పాకుతున్నావ్?"

"వెతుకుతున్నా... హి... హిహి..."

"ఏంటి?... ఏమన్నా పోయిందా?"

"ఊహూ... నువ్ నవ్వుతున్నావ్‌గా... నీ నోట్లోంచి ముత్యాలు రాలి కిందపడ్తున్నాయే. మోసని చూస్తున్నా హి...."

"గిలి... గిలిగిలిగిలి... గిజ్జాలి గిలిగిలి" మెలికలు తిరిగిపోతూ నవ్వింది సుశీల.

"నిజ్జంగా... నువ్వెట్టా నవ్వుతుంటే ఎంత బాగుంటుందో తెల్సా?..." కళ్ళు తిప్పుతూ అన్నాడు కాంతారావు.

"థాంక్యూ..." నవ్వీ నవ్వీ నోట్లోంచి కార్తున్న చొంగని తుడ్చుకుంటూ అంది సుశీల.

కాంతారావు ఓసారి "హిహి..." అని మళ్ళీ మోకాలిమీద పాకుతూ గడ్డిలోకి చూడసాగాడు.

"హబ్బ..! పొగిడింది చాల్లెద్దూ... నేనెళ్ళిన తర్వాత ముత్యాలేర్దుకుందువుగానిలే... ప్రస్తుతం నాతో మాట్లాడు..." మూతి పెట్టింది సుశీల.

"ముత్యాలేరటం కాదూ నా బొందాకాదు... ఇక్కడ ఎర్రచీమలున్నట్టున్నాయ్... మంటెక్కిపోతూంది" పాదాలు బరబరా గోక్కుంటూ అన్నాడు కాంతారావు.

"గిలి... గిలిగిలిగిలి... గిజ్జాలి గిలిగిలి" నవ్వింది సుశీల.

"నువ్విహ నవ్వమాకు బాబూ.. మోకాలిమీద పాకే ఓపిక నాకింక లేదు..."

"చాల్లే సరసాలు..."అంటూ చెంపమీద 'ఛెళ్ళు'మని కొట్టింది సుశీల.

"హబ్బా! ఎందబ్బా అట్టా కొట్టావ్?" దెబ్బకి కళ్ళు బైర్లు కమ్మి, దంగైపోతూ అడిగాడు కాంతారావు.

'నేనేం కొట్టలా గిలి... ఊర్కే సరదాకి చెంప మీద అలా తట్టా... గిలిగిలి..."

"అది తట్టడమా..? కొట్టడం లాగుం టేనూ..."

కాంతారావు ఆమెకి ఆ పక్కనుండి ఈ పక్కకు వచ్చి కూర్చున్నాడు.

ఇద్దరూ కాస్సేపు ఏ సంతలోనే తప్పిపోయి కొన్ని సంవత్సరాల పాటు ఒకరికొరు కనిపించకుండా పోయి, తర్వాత కల్సుకున్నట్టు ఒకరి మొహంలోకి మరొకరు దేభ్యంగాళ్ళలా చూస్తున్నారు.

తర్వాత గొంతు పెగల్చుకుని అంది సుశీల.

"కాంతా!... నేనంటే నీకు... నిజ్జంగా ప్రేముందా?"

"నిజ్జంగా,...! కావాలంటే మీ నాయినమ్మ మీదొట్టు..." సీరియస్‌గా అన్నాడు కాంతారావ్.

సుశీల తృప్తిగా నిట్టూర్చింది.

"సుశీ..." పది క్షణాల నిశ్శబ్దం అనంతరం గొంతులో ప్రేమను అతికష్టంమీద పలికిస్తూ అన్నాడు కాంతారావు.

"ఊ... ఏంటి?" గోముగా అడిగింది సుశీల.

"నువ్వు దూకమంటే నిప్పులో దూకుతా... మునగమంటే... నీళ్ళలో మునుగుతా...




ఫిబ్రవరి-14 ప్రేమి(కాము)కుల దినోత్సవం సందర్భంగా...

సువ్వంటే అంత ప్రేమ."

"నిజంగానా కాంతా?" దూరంగా కనిపిస్తున్న చెరువు వంక చూస్తూ సీరియస్‌గా అడిగింది సుశీల.

కాంతారావు గుండెల్లో రాయి పడింది.

కొంపదీసి ఆ చెరువులో దూకి మునగమనదు కదా?...

"అంటే నువ్వు దూకమంటే చెర్లో దూకుతాననుకో... హి... కానీ నాకు ఈత రాదుగా! హిహి... నీళ్ళల్లో దూకగానే మునిగిపోయి చచ్చూరుకుంటా... హిహిహి...." వెర్రి నవ్వు నవ్వుతూ అన్నాడు కాంతారావు.

"చాల్లే... నిన్ను చెర్లో దూకమని నేనెందుకు చెప్తాను...? నాకు నువ్వంటే ప్రేమ లేదా ఏంటి?" అంది సుశీల.

"నిజంగానా?" ఆనందంగా అడిగాడు కాంతారావు.

"నిజంగానే...నువ్వంటే నాకు ప్రాణం."

"అయితే నేను నిప్పుల్లో దూకమన్నా దూకుతావా?"

"దూకను..." అంది సుశీల.

కాంతారావ్ చిన్నబుచ్చుకుని బుంగమూతి పెట్టాడు.

సుశీల నవ్వింది.

"గిలి గిలిగిలి... నువ్విట్టా బుంగమూతి పెడ్తే నీ మొహం అచ్చు చుంచెలక మొహంలా వుంది. గిలి... గిలిగిలి... సర్లే...నువ్ దూకమంటే నిప్పుల్లోకూడా దూకుతా..."

"చాల్లే.. నిన్ను నిప్పుల్లో దూకమని నేనెందుకు చెప్తానూ?..." అన్నాడు కాంతారావ్.

"ఇద్దరం ఎందులోనూ దూకొద్దుగానీ ప్రస్తుతానికి ఏదైనా రెస్టారెంట్‌కి పోదాం" అంది సుశీల.

"కానీ... హి... హిహి..." బుర్ర గోక్కున్నాడు కాంతారావ్.

"రెస్టారెంట్‌కి వెళ్ళేముందు ఓసారి పొదలోకి దూర్దాం... ఏం?... హిహి..."

"నువ్వు మహా చిలిపి సుమా..." అంటూ ఫెడీల్మని బెంకిమీద సరసంగా కొట్టి పొదలోకి దూరింది సుశీల.

కాంతారావ్ బెంకి రుద్దుకుంటూ తనుకూడా పొదలోకి దూరాడు.

అయిదు నిమిషాల తర్వాత ఇద్దరూ పొదలోంచి బయటకు వచ్చారు.




కాంతారావు చొక్కా ఎత్తి, సుశీల కొంగు తోనూ మూతులు తుడుచుకుంటూ.

తర్వాత ఇద్దరూ రెస్టారెంట్‌కి వెళ్ళారు. ఇద్దరూ పక్కపక్కగా అతుక్కుపోయి కూర్చున్నారు.

బేరర్ వచ్చాడు.

"ఏం కావాలి సార్?"





కాంతారావు సుశీల వంక చూశాడు.

సుశీల కాంతారావు వంక చూసి కళ్ళు గరేసింది.

"నీకేది ఇష్టమైతే నాకూ అదే ఇష్టం... నువ్వే ఆర్డర్ చెయ్యి" అన్నాడు కాంతారావు.

సుశీల చెప్పింది "ఒక ప్లేట్ చికెన్ పకోడి... ఒక ప్లేట్ చికెన్ మంచూరియా...రెండు థమ్స్ అప్‌లు..."

బేరర్ ఆమె ఆర్డర్ చేసినవి తీస్కొచ్చాడు.

ఇద్దరూ వాటిని ఒకరికొకరు తినిపించుకుంటూ తిన్నారు.

చివరగా ఐస్క్రీం తెప్పించుకున్నారు.

సుశీల సగం తిన్న ఐస్క్రీం వంక దొంగ కార్చుకుని చూస్తూ అన్నాడు కాంతారావ్.

"నేనా ఐస్క్రీం కొంచెం తిననా? ఆ! హి...!"

"నీకు ఎంగిలంటే అంతిష్టమా?" కళ్ళు తిప్పుతూ అంది సుశీల.

"ఊ... మరేం!..." లొట్టలు లొట్టలుగా చొంగ కారుస్తూ... సుశీల ప్లేట్‌లోని ఐస్క్రీం వంక చూశాడు కాంతారావ్.

"సార్! మీ ప్లేట్‌లోని ఐస్క్రీం నేను ఎంగిలి చేసి పెట్నా సార్?" గబగబా కాంతారావ్ పక్కకి వచ్చి వినయంగా అడిగాడు బేరర్.

"నాకు ఆమె ఎంగిలంటే ఇష్టం...అందరి ఎంగిలిక్కా కాదు...." పళ్ళు కొరుకుతూ బేరర్‌తో అన్నాడు కాంతారావ్.

బేరర్ బుర్ర గోక్కుంటూ ఓ పక్కకి వెళ్ళి నిల్చున్నాడు.

కాంతారావు సుశీల ఐస్క్రీం, సుశీల కాంతారావు ఐస్క్రీం తిన్నాక బిల్ పే చేసి రెస్టారెంట్ బయటపడ్డారు.

"నేనిక వస్తా కాంతా... చాలా లైమై



పోయింది..." అంది సుశీల వాచీవంక చూస్తూ.

"అప్పుడేనా?" గుడ్లనీరు కుక్కుకుంటూ అడిగాడు కాంతారావ్.

"రేపు మళ్ళీ వస్తాగా..." సుశీల కూడా గుడ్లనీరు కుక్కుకుంది.

"రేపటిదాకా ఆగాలా?... ఉహూ... ఉహూ... ఉహూ" కుమిలి కుమిలి ఏడుస్తూ అన్నాడు కాంతారావ్.

"తప్పదుగా... మరేం చేస్తాం?..." సుశీల కూడా భయంకరంగా కుమిలింది.

తర్వాత ఇద్దరూ కాస్సేపు బ్యార్‌బ్యార్ అని ఏడ్చి ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళిపోయారు.

ఇది వాళ్ళిద్దరి దినచర్య.

కానీ... ఒకరోజు... పార్కులో...

"సుశ్శీ...మనం విడిపోక తప్పదు సుశ్శీ... మీవాళ్ళూ మా వాళ్ళూ మన పెళ్ళికి ఒప్పు కోరు. నీకు మీ వాళ్ళని ఎదిరించి రాగల శక్తి లేదు. పోనీ నేనే నీకు నచ్చజెప్పి ఎక్కడికైనా తీస్కెళ్ళి పెళ్ళి చేస్కుందామంటే అలా లేచి పోవడం నాకు ఇష్టం లేదు... అలా పిరికి వాళ్ళు పారిపోతారు..." బాధగా పొక్కా కాలర్ నలిపేస్తుంటూ అన్నాడు కాంతారావ్.

అసలు అతను చెప్తున్నదాంట్లో నిజం లేదు.

కాంతారావ్ ప్రస్తుతం మరో అమ్మాయిని పట్టాడు. అందుకని సుశీలను వదుల్చుకో వాలని అతని ప్రయత్నం.

కాంతారావు మాటలు విన్న సుశీల ఫాల్లు మని ఏడ్చింది. రెండు నిమిషాల తర్వాత కళ్ళు తుడ్చుకుంది.

"పోనీలే కాంతా...ఏ విధంగానూ నిన్ను బలవంతపెట్టి నీకు ఇబ్బంది కలిగించను.. నీ ఇష్టం. నువ్వెలా చేద్దామంటే అలా చేద్దాం." అంది.

"మనం ఇంక విడిపోదాం సుశ్శీ... నీ దారి నీది నా దారి నాది."

"అలాగే..." భారంగా అంది సుశీల.

కాంతారావు బాధని నటిస్తూ లోపల్లోపల సంతోషిస్తూ అక్కడినుండి పరుగున వెళ్ళి వేరే పార్కులో తనకోసం ఎదురు చూస్తున్న సుజాత దగ్గరికి వెళ్ళాడు.

మాటల సందర్భంలో సుజాతతో కాంతా రావ్ అన్నాడు.

"సుజ్జా... ఇదివరకు నాకో ఫ్రెండు వుండే దిలే... సుశీల అనీ...పరమ కోతిలా వుంటుం దనుకో... నామీద ఆశలు పెట్టుకుంది పాపం! నా మనసు నీదని పాపం దానికి తెలీదు... హిహి..."

"కాంతా..." సుజాత కాంతారావ్ గుండెల మీద ఒరిగిపోయింది.

అక్కడ-

సుశీల కూడా ఇంటికి గంతులేస్తుంటూ వెళ్ళింది.

కారణం- వారం క్రితం ఆమెకి పెళ్ళి చూపులు జరిగాయి.

అబ్బాయికి సుశీల బాగా నచ్చింది. అతనికి లక్షల కొద్దీ ఆస్తి వుంది. చాలా బాగుంటాడు కూడా. అమెరికాలో డాక్టరు.

పెళ్ళయ్యాక సుశీలను తనకూడా అమెరికా తీస్కెళ్ళిపోతాడు. మంచి అవకాశం!

కానీ కాంతారావుని వదుల్చుకోడం ఎలా అని సతమతమైపోతున్న టైంలో అతనే వచ్చి విడిపోదామని అన్నాడు.

ఆ విధంగా సుశీల సమస్య కూడా పరి ష్కారం అయ్యింది.



# మాస్టర్! అతని ఆర్ట్, క్రాఫ్ట్, నవ్వులు

-మోహన్




"అందగాడు చంద్ర. అందమైన గీత. ముచ్చటైన రంగులు. తనదంటూ ఒకశైలి ఉతడ్ కార్టూనులు నవ్వించును. తప్పక నేడే చంద్రను వాడగలరు" ఇలాంటి పిచ్చిమాట లెన్నన్నా ఎవరేనా చెప్పొచ్చు.

"పోతే చాలాకాలం నుంచీ చూస్తున్నాం. నువ్వేంటీ చెప్పేది?" అని మరెవరైనా తూష్ణీ భావముతో పరమ పీఠగా నోరు జారొచ్చు. తప్పేం లేదు.

చంద్రంటే తెలిసి తెలుగోడిని కనుక్కోడం కష్టం. చంద్రంటే అసాంతం తెలిసినవాళ్ళి పట్టు కోటం మరీ కష్టం. ఎందుకంటే అది నలభై ఏళ్ళ పని.

లిస్టు తీస్తే కొన్ని వేల కథలకు నలుపు తెలుపులో ఇలస్ట్రేషన్‌లు, రంగుల్లో బొమ్మలు, మరికొన్నివేల పుస్తకాలకు అట్టమీద బొమ్మలు, కార్టూన్‌లు... ఏది చెప్పినా వేలలోనే చెప్పాలి. పెయింటింగ్‌లు, గ్రీటింగ్ కార్డులు, ఇవి చాలవన్నట్టు కథలు రాయటం, ఇంకాస్త టైమ్ మిగిలిందనో ఏమో సినిమాల్లో నటించడం. కొన్నిటికి పబ్లిసిటీ పనిచేయటం, టీవీ సీరియల్స్ తీయడం... కనుక రెండు కళ్ళుగానీ, ఇరవై కళ్ళు గానీ చూడలేని, రెండు చేతులు గానీ, అరవైరెండు చేతులుగానీ తడమలేని పనిని చంద్ర సింగిల్ హేండెడ్‌గా చేసేశారు. దిసీజ్ టూమచ్ యార్. ఇంత వాల్యూమ్‌నీ, వేల్యూనీ ఉజ్జాయింపుగానైనా బేరీజు వేయటం ఏసింగిల్ మానవమాత్రుడికి మాత్రం సాధ్యం?

ఆ రోజుల్లో ఆర్టిస్టు అవుదామనుకున్న అనేకమందికి ఏదోవిధంగా ఈ చంద్ర ఫోల్డర్ కొట్టింది. అది మరో మూడు దశాబ్దాలు వెంటాడింది.

చంద్ర గీతని అర్థం చేసుకునీ, జరిగించుకునీ (లేక పూర్తిగా అర్థం చేసుకోలేకా, అరగించుకోలేకా) ఇలస్ట్రేటర్‌గా... కార్టూనిస్టులుగా పత్రికల్లో స్థిరపడినవారిని చూడొచ్చు.

అరవై దశకం మొదట్లో ప్రభ, పత్రిక వీక్లీల్లో మేటర్ మధ్య ఊహాచిత్రాలొచ్చేవి.

పత్రికల్లో సాంప్రదాయక పద్ధతినుంచి బాపు తెచ్చిన పెద్దబ్రేక్ ఒక ధోరణిగా స్థిర పడింది. దాని ప్రభావం నుండి వచ్చి ఇది మా స్టయిల్ అని అప్పుడు చూపించిన వాళ్ళలో చంద్ర ముందుంటారు.

కార్టూన్ కాకికి కన్నుగా ఓ చుక్క పెడతారు గదా! అలాటి చుక్క కన్నులేని కాకి నేలమీద వున్న చుక్కని వంగి కన్నుగా తెచ్చుకుంటుంది.

ఇందులో విరగబడి నవ్వేదేం లేదు. కానీ ఐడియా మెరుపు మళ్ళీ మళ్ళీ గుర్తొస్తుంది. అష్టవంకర్లు తిరిగిన హోస్‌పైప్‌తో తోటమాలి నీళ్ళు పెడుతుంటాడు. నీళ్ళూ అష్టవంకర్లుగానే తిరిగి పడుతుంటాయి. నవ్వొచ్చిందా? లేదు. మర్చిపోగలరా? లేదు!

'రిక్లైనింగ్ న్యూడ్' లాంటి పేరుండే, ఆడ పెయింటింగ్‌ను ఆర్టిస్టు మోసుకెళ్తుంటాడు. కానీ ఫ్రేమ్‌ని పట్టుకుని కాదు. అందులోని నడుం మాత్రంపట్టుకుని. చిలిపి? కదూ! కార్టూన్ బాక్స్ మధ్యలో గుండ్రటి సూర్యుడు. చుట్టూ లిస్సగా కిరణాల గీతలు. ఒక్క గీతమీద మాత్రం వాలిన పిట్ట బరువుకి కిరణం వంగి పోతుంది. సూర్యుడికి కోపం! తమాషా? కాదు! అంతకు ముందుగా ఇల్లాలూ, మొగుడూ, డాక్టరూ, ఆఫీసులో బాసూ, గుమాస్తా, చెట్టు కింద ప్రేమలాంటి మిడిల్‌క్లాస్ రింగులో గిరగీలు కొడుతున్న తెలుగు కార్టూన్ సరిహద్దుని ఆకాశమార్గం పట్టించాడు చంద్ర.







విజయలక్ష్మిరాజు

# పెళ్ళిఫోటో

"అన్నయ్య ఆ అమ్మాయి యింటికెళితే వాళ్ళమ్మ ఈడ్చి తంతుంది. ఎందుకంటే వాళ్ళింట్లో ఇద్దరూ అమ్మాయిలే. ఇంటికెవరైనా అబ్బాయిలొస్తే పోకిరీ వేషాలెయ్యటానికొచ్చావా? అంటూ వాయిస్తుందిట. నీకంటే ఘటికురాలు."

"అలాగా! మంచి పద్ధతి కల మనిషన్నమాట!"

"ఆవిడ నీకు నచ్చిందికదా! ఇక వెళ్ళిరానా?"

"అక్కర్లేదు రేపు కాలేజీలో ఇప్పించుకుందువుగాని ఇపుడున్న పుస్తకం చదువుకో చాలు!"

"వాళ్ళిల్లు ఎక్కడో చెప్పమ్మా! నేను వెళ్ళి తెస్తాను. మీ అమ్మతో ఎంతసేపని వాదిస్తావు" అంటూ గదిలోంచి వచ్చాడు సుబ్బారావు.

ఛీ! తనసింత ఇరిటేషన్‌కు గురిచేస్తుందే మిటి! వళ్ళు మండిపోయింది పావనికి.

"అక్కర్లేదు నాన్నా! మిమ్మల్ని వాళ్ళింటికి పంపిస్తే వాళ్ళేమనుకుంటారు. అసహ్యంగా నా గురించి వాళ్ళు... ముఖ్యంగా వాళ్ళమ్మ ఏమేవో ఊహించుకుంటుంది. చెప్పానుగా... ఆవిడ అమ్మకంటే ఘటికురాలని. కాకపోతే వాళ్ళమ్మ పల్లెటూరి మనిషి. చదువు రాదు. అమ్మలాగా పట్టాపుచ్చుకున్నావిడ కాదు!" అక్కసుగా అంటూ అక్కడినించి వెళ్ళిపోయింది పావని.

"ఎప్పుడూ దాన్నలా హింసిస్తావెందుకు? మరీ అంతలా ఆంక్షలు పెడితే మనముందు మంచిగా వుండి వాళ్ళకున్న టైంలో స్వేచ్ఛగా ప్రవర్తిస్తారు. నీకెంత చెప్పినా వినవెందుకు వల్లీ!" కూతురి బాధ చూడలేక విరసంగా అన్నాడు సుబ్బారావు.

"దాన్ని విచ్చలవిడిగా తిరగమని మీరే ప్రోత్సహించేలా వున్నారు. దాన్నికూడా మీ అన్నయ్య కూతురులాగా తయారు చేయాలనుకుంటున్నారా?"

**జరిగిన కథ:** పావని తల్లి పావనిని చాలా కట్టుదిట్టంలో ఉంచు తుంటుంది. ఆమె అన్నయ్యకు మాత్రం చాలా స్వేచ్ఛనిచ్చి అతను ప్రేమించిన అమ్మాయిని కూడా ఇంటికి రానిచ్చి, సకల మర్యాదలు చేస్తుంటుంది తల్లి. తల్లి ఇద్దరికీ చూపుతున్న తేడాని భరించ లేకుండా వుంటుంది పావని. ఇంటికి వచ్చిన కాబోయే వదినతో అన్నయ్య ప్రవర్తిస్తున్న తీరును తల్లి దగ్గర నిరసన వ్యక్తం చేస్తుంది పావని..... ఇక చదవండి

"ఎప్పుడో జరిగిపోయిన సంగతి ఇప్పుడెందుకు చెప్పు!"

"ఎప్పుడో ఏమిటి? ఈ జనరేషన్‌లోనేగా జరిగింది. దీనికా గతి పట్టకుండా కాపాడుకుని ఓ మంచివాడి చేతిలో పెట్టేదాకా నాకీ టెన్షన్ అవస్థ తప్పదు."

"ప్రతి విషయానికి ఇతరులతో పోల్చుకో వద్దు. అనవసరంగా ఆలోచిస్తే ఆరోగ్యం దెబ్బ తింటుంది" ఆమెతో వాదించటం ఇష్టంలేక ఊరుకున్నాడు సుబ్బారావు.

తల్లిదండ్రుల మాటలు వింటూ చాలాసేపు ఆలోచనలో పడింది పావని.

ఆ రాత్రి తండ్రిగదిలో ప్రవేశించి "నాన్నా! ఏదైనా ఫెయిర్ చెయ్యమంటారా? నిద్రపట్టటం లేదు" అంది పావని.

"అలాగా! ఇంత రాత్రిపూట వద్దులేమ్మా! రేపు చేద్దువుగాని."

"నవలా? కథా నాన్నా?"

"నవలేనమ్మా! ముందు నువ్వుదాన్ని పూర్తిగా చదివి ఆ తర్వాత ఫెయిర్ చెయ్యి!"

"అలాగేలెండి! అబ్బో, చాలా పేజీలున్నాయి. ఇదంతా ఒక్కరోజులో చదవలేనేమో!" అంటూ ఉండగానే ఫోను రింగయింది.

"చూడమ్మా! ఎవరో ఈ వేళప్పుడు చేశారేమిటి?"

"హలో!"

"హలో! నేను హనుమంతుగారి భార్యను కళావతిని. సుబ్బారావుగారున్నారా?"

"ఉన్నారాంటీ! నాన్నా! కళావతి ఆంటీ! రండి" అంది పావని.

"హలో! ఏమిటమ్మా, ఈ వేళప్పుడు..."



"అన్నయ్యా! ఆయనకు గుండెపోటు వచ్చింది. సమయానికి ఇంట్లో ఎవరూ లేరు. మామూలుగా ఆయన వాడే టాబ్లెట్ వేశాను. కొంచెం నెమ్మదించింది. అయినా నాకెందుకో భయమేస్తోంది. ఒక్కసారి శ్రమ అనుకోకుండా వచ్చి వెళ్ళండన్నయ్యా" దుఃఖంతో పూడుకుపోతున్న గొంతుతో అంది కళావతి.

"అదేమిటమ్మా! అలాగంటావు. తప్పకుండా వస్తాను. నువ్వు ధైర్యంగా వుండు" అంటూ ఫోను పెట్టేసి హడావిడిగా డ్రెస్ వేసుకున్నాడు సుబ్బారావు.

"ఏమిటి నాన్నా! ఏం జరిగిందిట!"

"హనుమంతు అంకుల్‌కు గుండెపోటు వచ్చిందిటమ్మా! వెళ్ళివస్తాను. మీ అమ్మను నిద్రలేపి ఈ విషయం చెప్పు... లేకపోతే వద్దులే...తలుపు వేసుకో... త్వరగా వస్తానో రానో మీ అమ్మ కంగారుపడుతుంది. నిదానంగా చెప్పు..." అంటూ చెప్పులేసుకుని గేటు దాటాడు.

"నాన్నా! నేనూ వస్తాను" అంది గేటుదాకా వచ్చిన పావని.

"ఈ వేళప్పుడు వద్దమ్మా! రేపు వెళ్ళి చూద్దువుగానీ! లోపలికెళ్ళు" హడావిడిగావెళ్ళిపోయాడు సుబ్బారావు.

తలుపేసుకుని లోపలికొచ్చి పడుకుంది పావని.



తల్లివేపు చూసింది గాఢంగా నిద్రపోతోంది.

తనపట్ల అమ్మ ప్రవర్తన గురించి నాన్నతో మాట్లాడాలనుకుంది.

కానీ అమ్మంటే నాన్నకు చాలా ప్రేమానురాగాలు. ఇంత హడావిడిలో కూడా ఆమెకు నిద్రాభంగం కలుగుతుందని ఆలోచించే నాన్నతో అమ్మమీద చాడీలు చెప్పినట్లుంటుందేమో! తనకు నాన్న సపోర్టు వుందనుకుంటోంది. నాన్నకూడా అమ్మ బాటలోనే ప్రయాణం చేస్తే... తన ప్రేమ సంగతి...పెళ్ళి సంగతి తేల్చేదెవరు? ఈ విషయమే సాగర్‌తో తను మాట్లాడింది.

"అమ్మ ససేమిరా ఒప్పుకోదు. నాన్నను కన్విన్స్ చేద్దామంటే చెయ్యొచ్చనిపించేలాగానే వుంటాడు. కానీ అమ్మమాటే కరెక్టన్నట్టుగా నా ముందు ప్రస్తావిస్తాడు. తోచటంలేదు" అందోసారి పావని.

"ఏమిటీ తోచేది గాడిదగుడ్డు! ప్రేమికులకు తల్లిదండ్రుల సపోర్టు ఇచ్చి అక్షింతలు వేసి ఆశీర్వదించి గ్రూప్‌ఫోటో దిగటంలాంటివి ఇండియాలో అందునా ఆంధ్రదేశంలో ఈ యుగంలో జరగవు. ఈ కాలం ప్రేమికులకు పెద్దవాళ్ళ సపోర్టు కాదు కావాల్సింది ఉద్యోగం సపోర్టు. చెరో ఉద్యోగం సంపాదించుకుని ఏ తిరుపతికో చెక్కేసి పెళ్ళి చేసుకుని కాపురం పెట్టెయ్యాలి. కొంతకాలం గడిచాక నా కొడుకు నా కూతురు అనుకుంటూ దిగొస్తారు. సుఖాంతమౌతుంది" అన్నాడు సాగర్ తేలిగ్గా కొట్టేస్తూ.

"తప్పు!... అలాంటి పని మనం మాత్రం చెయ్యొద్దు. పెద్దవాళ్ళచేతులమీదుగా మన పెళ్ళి జరగాలి."

"చూడమ్మా! పరమ పావనీ!... పెద్దవాళ్ళ చేతులమీదుగా పట్టుచీరెలు తెచ్చి, అవి కట్టుకుని పూలజడ కుట్టుకుని, గోరింటాకు పెట్టుకుని, అగ్నిహోత్రం చుట్టూ మనమిద్దరం

తిరుగుతుంటే వీడియోలు, కెమెరాలు క్లిక్ మంటుంటే... మైకులోంచి శ్రీ సీతారాముల కళ్యాణం చూతము రారండీ పాట వినిపిస్తుంటే... ఈ లెవెల్లో కలలు కంటున్నావేమో. మనకంత లేదుగానీ ఫుల్‌స్టాప్ పెట్టి ఉద్యోగాలు రాగానే మనమెలా బతికిపోవాలో ఆలోచించు."

"నువ్వూరుకో సాగర్! అలాంటి పనులొద్దు. మా అమ్మానాన్న ప్రేమించి పెళ్ళి చేసుకున్నారట. అదీకూడా పెద్దల అంగీకారంతో. వాళ్ళు మన ప్రేమ గురించి కాస్తయినా ఆలోచించరా? తప్పకుండా ఆలోచిస్తారు. మనకు గ్రీన్‌సిగ్నల్ ఇస్తారు" అంది పావని.

"గ్రీన్‌సిగ్నలా! సిగ్నల్స్ ఇవ్వకుండా రైలు పట్టాలు పీకేసినంత పని చేస్తారు ఈ పెద్దవాళ్ళు. మా అమ్మానాన్న కూడా పదేళ్ళ వయసప్పటినుంచి తూనీగ తూనీగ అని పాడుకుని ప్రేమించుకునే పెళ్ళి చేసుకున్నారట. వాళ్ళకు ఒకరంటే ఒకరికి ఎంత ప్రేమో! ఇంట్లో వయసొచ్చిన కొడుకు తిరుగుతున్నాడన్న స్పృహ కూడా లేకుండా ఇద్దరూ ఒకే కంచంలో గోరుముద్దలు తినిపించుకుంటూ తింటారు.

అరె... వికికీ జ్ఞానముందని ఎందుకనుకోరు... నన్ను గమనించరు. కానీ కాలేజీనించి అరగంట లేటుగా వస్తే "ఏరా! అమ్మాయిలకు ఫోజులిస్తున్నావా? అంత లేటయిందెందుకు?" అంటూ నాన్న బేతాళ ప్రశ్నలేస్తాడు. చూడ్డానికి




విదురునిలా కన్పిస్తారుగానీ అన్నీ శకుని పోలికలూ, లక్షణాలూ!" అసహనంగా అన్నాడు సాగర్.

"మీ అమ్మగారిని మంచి చేసుకోరాదూ! సాధారణంగా అమ్మలకు కొడుకులమీద ప్రేమ ఎక్కువంటారు కదా! అనటమేమిటి మాఇంట్లో చూస్తున్నాగా! అన్నయ్య ప్రేమను అమ్మ ఒకే చేసిందిగా"

"అబ్బో! మా అమ్మ ఊహించు కుంటోంది. తన కోడలు తనకు మంచంమీద కూర్చోపెట్టి సేవలు చేయాలని... తన కొడుకు తన చెప్పుచేతల్లో వుండాలని, కొడుకును ఎగరేసుకు పోయే కోడలు రాకూడదనీ... అదనీ, ఇదనీ టి.వి.సీరియల్స్ చూసి చూసి రిహార్సల్ వేసుకుంటోంది."

"చాల్లే! ఊరుకో! అన్నీ నువ్వే ఊహించుకుంటావు."

"ఊహ కాదు పావనీ! పచ్చి నిజాలు! ఉదాహరణలు చెప్పనా?"

టి.వి.సీరియల్స్‌లో ఓ కోడలు ఎదిరించి మాట్లాడటమో, తెలివిగా ప్రవర్తించటమో చేసిందనుకో! ఆవేశం తట్టుకోలేక ఈ కోడలికెంత పొగరో చూశారా? ఉప్పు తిన్నేవాళ్ళు లేక అదే నేనైతేనా మూడుచెరువుల నీళ్ళు తాగించేదాన్ని. పిచ్చి మొహంది ఈ అత్త. పడరాని పాట్లు పడుతోంది. అంటూ కోపంతో ఊగిపోతూ మా నాన్నతో అంటుంది.

అబ్బ! అది సీరియల్ లెద్దూ! నీకెందుకంత ఆవేశం అంటూ చల్లని నీళ్ళు తెచ్చి త్రాగమంటుంటాడు నాన్న.

వీళ్ళిద్దర్ని చూస్తూంటే నాకు వళ్ళంతా కారం రాసుకుంటున్నట్లుంటుంది" కోపంగా అన్నాడు సాగర్.

"టి.వి. సీరియల్స్, సినిమాలంటే గుర్తొచ్చింది. మా అమ్మ టి.వి.లో వచ్చే సినిమాలు బాగా చూస్తుంది.

ఈ మధ్య అన్నీ లవ్‌స్టోరీల సినిమాలే కదా! హీరో హీరోయిన్లు కలుసుకోలేకపోయినా,



పెద్దవాళ్ళు ఆటంకాలలో హీరో దెబ్బలు తింటున్నా, హీరోయిన్ ఏడుస్తున్నా మా అమ్మ కూడా ఏడుస్తుంది. వాళ్ళిద్దరికీ ఎలాగోలా పెళ్ళయితే బావుండునని కోరుకుంటుందని తన హావభావాల ద్వారా మనకు తెలుస్తుంటుంది. కానీ అది సినిమా వరకూ!

నేను కాస్త త్వరగా కాలేజీకి బయల్దేరినా, లేటుగా వచ్చినా అనుమానం. ఎవర్నయినా లవ్ చేస్తున్నావా? ఎవర్ని కలుసుకోవాలని అంత తొందర? ఎవర్ని కలుసుకుని వస్తున్నావ్ ఇంత లేటయింది అంటూ పూర్తిగా మొరటు మనిషిలా మాట్లాడుతుంది. ఆ మాటలు వింటుంటే పారిపోదామనిపిస్తుంది."



"ఈ పెద్దవాళ్ళను మనం మార్చలేము. కాలమే అన్నింటికీ సమాధానం చెబుతుంది" శూన్యంలోకి చూస్తూ వేదాంతిలా మాట్లాడుతున్న సాగర్‌ని చూసి ఫక్కుమని నవ్వేసింది పావని.

"ఏమిటి నిద్రలోనే నవ్వేస్తున్నావా?" నిద్ర మత్తులోనే అడిగింది శ్రీవల్లి.

పావని పలకకుండా నిద్ర నటించింది.

ఆలోచనల్లోంచి తేరుకుని వాస్తవంలో కొచ్చిన పావని తండ్రిని గురించి, హనుమంతు గురించి ఆలోచించింది.

సుబ్బారావు, హనుమంతు ప్రాణ స్నేహితులు. శ్రీవల్లి, కళావతి కూడా మంచి స్నేహితులు. కానీ వారి పిల్లలకు, వీరి పిల్లలకు మాత్రం పెద్ద స్నేహాలు లేవు. హనుమంతు ఆరోగ్యం దెబ్బతినటానికి కారణం అతని పిల్లలేనని సుబ్బారావు శ్రీవల్లి మాట్లాడుకోవటం చాలా వినింది పావని.

ఆలోచనలతో అలాగే నిద్రపోయింది పావని.

"పావనీ! పావనీ! నాన్నగారెక్కడికెళ్ళారు?" కంగారుగా లేపుతూ అడిగింది శ్రీవల్లి.

"హనుమంతు అంకుల్‌కి గుండెపోటు వచ్చిందట. అంటీ ఫోను చేస్తే వెళ్ళారు... కంగారుపడాల్సిందేమీ లేదుటలేమ్మా! ఆంటీకి ధైర్యంగా వుంటుందని తోడుకోసం వెళ్ళారు. తెల్లారగానే వచ్చేస్తారులే పడుకో"

హనుమంతు ఇంటికి ఫోను చేసి కళావతితోనూ, సుబ్బారావుతోనూ మాట్లాడేదాకా మనసు నిమ్మళించలేదు శ్రీవల్లికి.

"అసలేం జరిగింది కళావతీ! ఎందుకిలా అన్నయ్య ఆరోగ్యం దెబ్బతింది? ఎక్కువగా ఆలోచిస్తున్నాడా?"

మరుసటిరోజు పావనితో కలిసి వెళ్ళి శ్రీవల్లి అడిగింది కళావతిని.

"ఎక్కువగా ఈ పిల్లలగురించి ఆలోచించి దెబ్బ తింటున్నాము" కన్నీళ్ళొత్తుకుంది కళావతి.




పిల్లల గురించి ఆలోచించటమేమిటి? శ్రీధర్ ఉద్యోగం చేస్తున్నాడు ఎవరో అమ్మాయిని ప్రేమించాడు. త్వరలో వాడు కోరినట్లుగానే పెళ్ళి చేసేస్తామన్నారుగా! అమ్మాయి సమీర చదువు పూర్తయిందని మొన్నే మంచి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌తో నిశ్చయ తాంబూలాలు తీసుకున్నారాయె, ఏమిటి ప్రాబ్లం?" అడిగింది శ్రీవల్లి.

"సమీరకు నిశ్చయ తాంబూలాలు అయ్యాయి.

పెళ్ళి ప్రయత్నంలో మేముండగా హఠాత్తుగా మీ అమ్మాయితో ఈ పెళ్ళి మా అబ్బాయిష్టం లేదంటూ ఫోనొచ్చింది."

"అదేమిటి ఎందుకలాగ?" (సశేషం)



కథ

# తెలివైన నిర్ణయం

కోనె నాగవెంకట ఆంజనేయులు

ఈ రాముగారితోచచ్చే చావొచ్చి పడిందండీ! ఏ రాముగా గారం టారా! ఇంకే రాముగారు! ఈ పత్రిక ఎడిటర్ రాముగారేనండీ. 'ఎలాగూ రిటైరైపోయారు కదా! ఇకనుండీ నెలకొకకథైనా మన పత్రికలో మీది రావాల్సిందే సార్' అని ఒకటే గోల.

నెలకో కథంటే మాటలా చెప్పండి! అయినా రిటైరయ్యానన్న మాటేగానీ యింట్లోఒక్క నిముషమైనా ఖాళీగా వుండనిస్తుందా మా ఆవిడ మహారాణీగారు.

'ఇంక ఆఫీసు వుండటం లేదు కదా ఖాళీగా వుండి యేం చేస్తారు' అంటూ ప్రతీ పనీ నాకే పురమాయిస్తోంది. రాళ్ళల్లోబియ్యం ఏరడం దగ్గిర్నుంచి మిల్లుకెళ్ళి పిళ్ళు ఆడించటం వరకూ నాదే డ్యూటీ. చెయ్యలేక చస్తున్నానంటే నమ్మండి.



నిన్న మొన్నటిదాకా ఎ.సి. ఆఫీస్‌లో కాలుమీద కాలేసుకుని దర్జాగా రెస్ట్ తీసుకునే నాకు ఎన్ని బాధలొచ్చిపడ్డాయో ఆయనగారికెలా... ఎలా ఎలా ఎలా ఎలా తెలుసనూ!

కథ కాదుగానీ ఈ నెల మా పక్కవీధి కమలాక్షిగారి ఈత ప్రావీణ్యం గురించి చెబుతాను. కమలాక్షిగారు కోటీశ్వరురాలు. నలుగురంటే నలుగురు ఆడపిల్లలు వాళ్ళకి. మగపిల్లలు లేనేలేరు.

కమలాక్షిగారికి స్విమ్మింగ్ ఛాంపియన్ కావాలనేది చిన్నప్పటినుండీ వున్న కోరిక.

కానీ ఆవిడకి నీళ్ళంటే చచ్చేంత భయం. ఇంట్లోనే స్విమ్మింగ్ పూల్ కట్టించుకుని ఈత



**చం**ద్రగారు ఎంత మృదుస్వభావో నాకు ఆయనతో పరిచయమైన అయిదు నిమిషాల్లోనే అవగతమయింది.

1999లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి నిర్వహించిన వచన నాటకంపై అధ్యయన శిబిరంలో పాల్గొంటున్న సమయంలో... హైదరాబాద్ రవీంద్ర భారతిలో వాహిని ట్రస్ట్‌వారి కథల పుస్తకం ఆవిష్కరణ సభకు మిత్రునితో కలిసి వెళ్ళాను. సభలో ఆ రోజు ఆవిష్కరింపబడిన పుస్తకం కొనుక్కున్నాం. ఇంతలో అదే సభకు విచ్చేసిన చంద్రగారు అటువైపుగా రావడం చూసి ఆయనకు నమస్కరించి మా చేతిలో నున్న పుస్తకం అట్టమీద ఆయన ఆటోగ్రాఫ్ కోరాం. ఆయన ఆ ముఖచిత్రం చూసి "యిది బాపుగారు గీసిన బొమ్మండి. దీనిపై నా సంతకం చేయడం అంత సమంజసం కాదండి అంటూ ఎంతో మర్యాద పూర్వకంగా చెప్పారు. ఆయన ఆ మాటలుఎంత మృదువుగా చెప్పారంటే మంచిగంధం ఒంటిపై రాసుకున్నంత చల్లగా, హాయిగా అనిపించింది మాకు. ఆయన చెప్పింది సబబుగానే అనిపించడంతో ఆయన సంతకం పుస్తకం లోపలిపేజీలో తీసుకుని ఆయనకు కృతజ్ఞతలు తెలిపి సెలవు తీసుకున్నాం. ఇంతటి మృదు స్వభావియైన చంద్రగారిపై ప్రత్యేక సంచిక తీసుకువస్తున్న హాస్యానందం ఎడిటర్ రాముగారికి ధన్యవాదాలు. చంద్రగారికి వినమ్రపూర్వకంగా అభినందనలు తెలియజేసుకుంటున్నాను.

**-కౌసె నాగవెంకట ఆంజనేయులు, విశాఖపట్టణం**

నేర్చుకునే ప్రయత్నాలు చేస్తుంటారెప్పుడూ ఆవిడ.

కానీ ఆవిడ ఈత ప్రావీణ్యం మాత్రం అంతంత మాత్రమే.

కోరి ఏరి ఏరి ఆమాటెట్లేలాంటి స్విమ్మింగ్ ఛాంపియన్లను వెతికి మరీ నలుగురు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేశారు. కానీ ఏ అల్లుడూ ఆవిడను ఈతలో ప్రావీణ్యురాలిని చేయలేకపోయారు.

ఎంత ప్రయత్నం చేసినా కానీ ఆవిడ మాత్రం తన కోరికను చంపుకోలేదు.

ప్రతీ పండక్కీ నలుగురు అల్లుళ్ళనూ పిలుస్తుంటారు.

విందు వినోదాలలో ఆనందంగా గడుపుతారు కుటుంబ సభ్యులందరూ.

అల్లుళ్ళ ఎదుట ఏ మాత్రం సిగ్గుపడకుండా స్విమ్మింగ్ డ్రస్ ధరించి ఈతకొలనులో దిగుతుంటారు కమలాక్షిగారు.

ఇలాగే ఓ పండుగ సందర్భంలో స్విమ్మింగ్ పూల్‌లోకి దిగి ఈదలేక సతమతమవుతూ మునిగిపోతున్న సమయంలో దగ్గర్లోనే వున్న పెద్దల్లుడు గభాలున స్విమ్మింగ్‌పూల్‌లో దూకి ఆవిడను కాపాడాడు.

తన ప్రాణాలను కాపాడిన పెద్దల్లుడికి ఆవిడ బైక్ కొనిచ్చారు కృతజ్ఞతగా

మరోసారి మరో పండక్కి నలుగురు అల్లుళ్ళూ యింటికి వచ్చి వున్నప్పుడు కమలాక్షిగారు ఈత కొలనులో దిగి ఊపిరాడక కొట్టుకుంటుంటే అది గమనించిన రెండో అల్లుడు ఈతకొలనులో దిగి ఆవిడ జుట్టు పట్టుకుని బయటికి ఈడ్చుకొచ్చి ప్రాణాలు కాపాడాడు.

ఆ రెండో అల్లుడికి తన ప్రాణాలు కాపాడినందుకు కృతజ్ఞతగా ఆవిడ స్కూటర్ కొనిచ్చారు.

ఇలాగే మరో పండక్కి ఈతకొలనులో దిగి ఈదలేకపోతుంటే మూడో అల్లుడు కొలనులోకి దిగి ఆవిడ ప్రాణాలు కాపాడాడు.

అతనికి ఆమె మోపెడ్ కొనిచ్చారు.

నాలుగోసారి మరో పండుగ సందర్భంలో ఈతకొలనులో దిగి ఊపిరాడక సతమతమవసాగారు కమలాక్షిగారు.

ఆ సమయంలో దగ్గరలో వున్నది నాలుగో అల్లుడొక్కడే.

కాని అతను ఆమెను రక్షించే ప్రయత్నమేమీ చెయ్యకుండా కామ్‌గా తన పని తాను చేసుకో సాగాడు.

ప్రాణాలకు తెగించి ఆమె ప్రాణాలు కాపాడినా తనకు వచ్చే బహుమతి సైకిలే కదా! అంత మాత్రానికి తనెందుకు రిస్కు తీసుకోవాలని అతను కామ్‌గా వుండిపోవడంతో మిగతా వాళ్ళందరూ పరుగు పరుగున అక్కడికి చేరుకునేలోగానే కమలాక్షిగారి శవం నీటిపైన తేలింది.

అదండీ కథ! ఆగండాగండి! ఈ విషయం కూడా చదివి అప్పుడు తరువాత పేజీలో వున్న చంద్రగారి కార్టూన్లు చూసి నవ్వుకోండి...

దినవారాలన్నీ అయిపోయిన తరువాత అతని మామగారు ఆ నాలుగో అల్లుడికి కారు కొనిచ్చాడండీ! అదీ కొసమెరుపు!






## పబ్లిక్ టాక్!

## పూర్తిగా విరబూసిన 'సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు'

**తె**లుగులో చాలా రోజులకు వచ్చిన మల్టీ హీరోల చిత్రం. ఇది ఏ మాత్రం హింస లేకుండా కుటుంబ కథా చిత్రంగా రావడం తెలుగు ప్రేక్షకులకు ఆనందమే. మనీకి విలువ నిస్తూ అనుబంధాలు దూరం చేసుకుంటు న్నారని, పక్కవాడికి సహాయం చేసే మనస్తత్వం ఇవ్వడమే దేవుడు మనిషికి ఇచ్చిన ఆస్తి అని, మనిషి అంటేనే మంచి అనే కాన్సెప్ట్‌తో తీసిన చిత్రం "సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు".

కథ విషయానికి వస్తే అంజలి (సీత) తల్లి, తండ్రి చనిపోవడంతో బాబాయిలు ఇద్దరు మేనమామ అయిన ప్రకాష్‌రాజ్ ఇంట్లో విడిచి వెళ్ళిపోతారు. పెరిగి పెద్ద అయిన అంజలిని ప్రకాష్‌రాజ్ పెద్ద కొడుకు వెంకటేష్‌కి ఇచ్చి పెళ్ళి చేస్తారని ఊర్లో అంతా అనుకుంటుం టారు. వెంకటేష్ మాటపడని మనస్తత్వంతో ఏ ఉద్యోగంలో ఇమడలేక సగంలో ఉద్యోగం మానేస్తూ ఉంటాడు.

చిన్న కొడుకు మహేష్ ఉద్యోగ ప్రయత్నం కోసం హైదరాబాద్‌లో ఉంటాడు. మరదలు వరసైన 'సమంతా' మహేష్‌ను ఇష్టపడుతుంది.

డబ్బుకు విలువనిచ్చే బాబాయిలు అన్న కూతురుని ఏ పనీపాట లేని వెంకటేష్‌కు ఇచ్చి పెళ్ళిచేయడానికి ఇష్టపడరు.

ఎప్పుడు డబ్బే ముఖ్యం కాదు మంచితనం ముఖ్యమని జరిగిన సంఘటనల ద్వారా తెలుసుకుని సీతమ్మను, చివర్లో పెద్దాడుకిచ్చి పెళ్ళి జరిపిస్తారు.

కథనం విషయానికొస్తే చిత్రం ప్రారంభం అయిన అరగంటలో ప్రేక్షకులంతా కథలో లీనమయ్యే విధంగా దర్శకుని చిత్రీకరణ చాలా బాగుంది.

వెంకటేష్, మహేష్‌ల పాత్రపై దర్శకుడు ఎక్కువ శ్రద్ధ చూపించినట్టుంది. అన్నదమ్ములు ఒరేయ్, ఒరేయ్ అనుకోవడం, పెద్దోడు మాట పడడు, చిన్నోడు మాటలతో బూరెలు వండే స్తాడు. అనే డైలాగ్‌కు జస్టిఫికేషన్ అయ్యే విధంగా ఇద్దరి పాత్రలు రూపొందించటం, మొదటి పాటలో ఇద్దరినీ చూపించడం చెరో డ్యూయెట్ ఇలా ప్రతి విషయంలో ఫైట్స్ లేక పోయినా ఇద్దరి హీరోలకు సరైన న్యాయం చేసారు దర్శకులు.

సంపాదనే జీవితం కాదనే, దర్శకుని ఆలో చన మంచిదే కాని జీవించడానికి సంపాదన అవసరమే అన్న విషయానికి దర్శకుడు ఇంపా ర్టెంట్ ఇవ్వకపోవడంతో కథను అసంపూర్ణం గానే చూపించినట్లయింది.

ఒక హీరో మాటపడక ఉద్యోగం చెయ్య డానికి ఇష్టపడడు మంచిదే, కానీ వ్యవసా యమో వ్యాపారమో చేసినట్టు చూపించి ఉంటే బాగుండేది. మాటలతో బూరెలు వండేసే క్యారెక్టర్, చూసిన రెండు క్షణాల్లో అమ్మాయిలు ఇష్టపడే అందం కలిగిన హీరో ఉద్యోగం చెయ్యకుండా ఖాళీగా ఉండడం ఏమిటో దర్శ కునికే తెలియాలి మరి. బహుశా వెంకటేష్‌కు ఉద్యోగం లేకుండా మహేష్‌కు ఉద్యోగస్తుడిగా చూపిస్తే బ్యాలెన్స్ తప్పినట్టు అవుతుందను కొనుంటారు.

ఉద్యోగం లేక బేవార్స్‌గా తిరుగుతూ మాట పడను అనుకునే వెంకటేష్ క్యారెక్టర్ అర్థం లేకుండా పోయింది.

నటీనటుల విషయానికి వస్తే మల్టీ హీరో లుగా చిత్రాలు రావాలనే మంచి మనసుతో అంగీకరించిన వెంకటేష్ అభినందనీయుడు. కథకు వెరీ ఇంపార్టెంట్ క్యారెక్టర్ కాకపోయిన తన సహజ నటనతో మహేష్ అందరికన్నా ఎక్కువ మార్కులు సంపాదించాడు. ఈ చిత్రం వలన ఫ్యామిలీ ఆడియన్స్‌ని తన అభిమాను లుగా చేసుకున్నాడు.

సీతమ్మగా చేసిన అంజలి, తండ్రి పాత్రలో ప్రకాష్‌రాజ్ జీవించారు. సమంత నటన సో... సో... మ్యూజిక్ విషయానికి వస్తే సిట్యుయే షన్‌సాంగ్, టైటిల్‌సాంగ్ ఆహ్లాదకరంగా ఉన్నాయి.

ఫస్టాఫ్ స్పీడ్‌గా సాగి సెకండ్ హాఫ్ స్లోగా ఉంది అనిపించి పూర్తి సంతృప్తి ఇవ్వక పోయి నా చాలా రోజులకు మల్టీస్టారర్‌గా వొచ్చి చిత్రంగా మంచి విజయాన్ని సొంతం చేసు కుంది.

**చంద్రశేఖర్ త్యాడి**




**చం**ద్ర మా వూరికొస్తే, నాకూ నా మిత్రుడు కే.శే. గోపాల్‌కీ భలే సంబరం. అందరం కోడంబాకంలో 'జ్యోతి' మాసపత్రిక సంపాదకులు వేమూరి సత్యనారాయణ గారింట్లో కలిసేవాళ్ళం. మాతోపాటు 'జ్యోతి' సంస్థ యజమానురాలు శ్రీమతి లీలావతి రాఘవయ్యగారి కొడుకులు, ముఖ్యంగా గాంధీ జతకలిసేవాడు. అందరం కోడంబాకం రోడ్డుమీద, డైరెక్టర్స్ కాలనీదాకా జోకులేసుకుంటూ నడిచి "హాలీవుడ్" రెస్టారెంటులో టీలు తాగి అల్లరి చేసేవాళ్ళం.

చంద్ర ఎప్పుడు కుంచె పడతారో, ఎప్పుడు రంగులు ఝళిపిస్తారో, అయన్ని వెన్నంటి ఆత్రంగా ఎదురుచూసేవాడిని. 'జ్యోతి' పత్రిక ఆఫీసులో, రాత్రి ఒంటిగంటకో, రెండింటికో కూర్చొని పొద్దు పొడిచేలోగా తమ ప్రతిభను ప్రదర్శించేవారు. నేనూ, గోపాలూ, ఆ రంగుల బొమ్మను, కళ్ళింత పెద్దవి చేసి, ఆనందాతిశయాలతో చూస్తూ కూర్చుండిపోయే వాళ్ళం.

బహుముఖ ప్రజ్ఞాశాలి చంద్రలో దాగిన కార్టూనిస్టు చంద్ర అప్పుడప్పుడు బైటపడి నన్ను దిగ్భ్రాంతుడ్ని చేసిన సందర్భాలు చాలా వున్నాయి. తెలుగు కార్టూనుతో ఎక్స్‌పెరిమెంట్లు చేసిన తొలి కార్టూనిస్టు చంద్రగారే.

నేనూ చంద్రగారూ కలిసి 'చీకటి శృంగారం' సబ్జెక్టుమీద పోటీలు పడి, ఒక పోట, ఒక రాత్రి, యాభైకి పైబడిన కార్టూనులు సృష్టించాము. అది మరపురాని అనుభూతి.

రంగులు ఎలా కలపాలి, గీతలు ఎలా గీయాలి. కుంచె... ముఖ్యంగా ఏ నంబరు ఏ గీతకి వాడాలి, ఇవన్నీ నేను చంద్రగారి పక్కనే కూర్చుని నేర్చుకున్నాను. ఆయన పోర్ట్రైట్ ఆర్టు టాలెంట్ అద్భుతం. గొప్ప పెయింటర్ కదా!

మన తెలుగు జాతి గర్వించదగ్గ చిత్రకారుడు చంద్ర! ఆయనగారి అత్యంత అభిమాన మిత్రుల జాబితాలో నేనూ ఒకడ్ని. అందుకు నేను చాలా గర్వపడతాను.

–కార్టూనిస్ట్ జయదేవ్







**కొ**న్ని కార్టూన్లు మనల్ని హాయిగా నవ్విస్తాయి. కొన్ని మనకి అర్థం పడతాయి.

ఇంకొన్ని వెక్కిరిస్తాయి.

కవులు సొంతగొంతులు వెదుక్కున్నట్లే– చిత్రకారులు సొంత గీతలు వెదుక్కుంటారు. దొరకనివాళ్ళు పాతగీతలతోనే బొమ్మలు కట్టుకుంటారు.

చంద్ర తన సుదీర్ఘమైన ఆర్టిస్ట్ కెరియర్‌లో వేలసంఖ్యలో ఇలస్ట్రేషన్లు, కవర్‌పేజీలు, కవితలకి బొమ్మలు, లోగోలు, కార్టూన్లు చిత్రించారు.

బొమ్మల ప్రపంచంలో చంద్ర ఒక ప్రత్యేక కక్ష్యని ఏర్పాటు చేసుకున్నారు. ఆయనని అనుసరించేవారు, అభిమానించేవారు ఎందరో వున్నారు.

కథారచయితగా కూడా చెయ్యి తిరిగిన వారు. కాని చంద్ర-కళ కథని డామినేట్ చేయడం వల్ల చంద్ర అనగానే స్ఫురించేవి ఆయన బొమ్మలే.

హాస్యం, వ్యంగ్యం, మరక అన్నీ వుండి– మళ్ళీ అందులో శబ్ద, ధ్వని, శ్లేష, అతిశయ, ఉపమ లాంటి అలంకారాలు, ఆంగికం, వాచకం లాంటి నాట్యలక్షణాలు కార్టూన్‌లో తొంగిచూడాలి. అలాంటి సలక్షణాలన్నీ చంద్ర గారి వ్యంగ్య చిత్రాలలో వెతక్కుండానే కనిపిస్తాయి.

నాకు చంద్రగారంటే ఆర్టిస్ట్‌గా ఎంత గౌరవమో, స్నేహశీలిగా అంత ఇష్టం.

నన్నేకాకుండా యింకా కొందరిని కూడా ఆయన 'గురువుగారూ' అని మన్ననగా సంబోధిస్తారు.

మరి ఆ పిలుపుకి ఆయన పర్సనల్ డిక్షనరీలో ఏమి అర్థం వుందో తెలియదు. తెలుసుకోవాలన్న కాంక్ష కూడా లేదు.

ఇంత వాల్యూమ్ సెన్సాఫ్ హ్యూమర్ వున్న మనిషి ఏ అర్థంలో వాడుతున్నారో? వివరించి, విచారించడం దేనికి? –శ్రీరమణ



కథ

# లవ్ రివేంజ్

గంగాధర్ వడ్లమన్నాటి

కావ్య తన ల్యాప్‌టాప్‌లో తన స్నేహితు రాలితో వెబ్‌చాట్ చేస్తూ... ఏంటి ఇంత సడెన్‌గా? నేను వద్దన్నా, లేదా అనా ఇలా సడెన్‌గా నాకు ఫోన్ చేసి వెబ్‌చాట్‌కి ఇన్వైట్ చేశావ్?" అడిగింది కావ్య కోపంగా.

"ఛ ఛ అవేం మాటలు. ఏదో మా ఆయన రెండో డాడీ మూడో వైఫ్ ఇక్కడ గార్డెన్‌సిటీలో పుట్టినరోజు పార్టీకి రమ్మంటే ఇద్దరం వెళ్లాం. నేనెళ్ళకపోతే మావారు నా దుంప తెంచు తారని తప్పక వెళ్ళాను. అందుకే నేను ఇండి యాకి, నీ పెళ్ళికోసం రాలేకపోయాన్రా. సారీరా" చెప్పింది షర్మిష.

"అంతేలే. మాటలు నేర్చావ్" చెప్పింది కావ్య మూతి విరుస్తూ.

"అదేంలేదు కానీ, కొత్తపెళ్ళికూతురివి. పైగా ప్రేమించి పెళ్ళి చేసుకున్నావ్. ఎంతైనా లక్కీగాళ్‌రా నువ్వు" చెప్పింది షర్మిష ఉత్సా హంతో.

"కరెక్ట్‌గా చెప్పావ్. ప్రేమించి పెళ్ళి చేసు కున్నాను. కాకపోతే ఒకడ్ని ప్రేమించి మరొ కడ్ని పెళ్ళి చేసుకోవాల్సి వచ్చింది. దాంతో నా ఆశ చచ్చింది" చెప్పిందామె నిట్టూరుస్తూ.

"అదేంటే అలా అంటావ్! నువ్వు ప్రేమిం చిన సంగతి ఇంట్లో చెప్పానన్నావ్‌గా" అడి గిందామె ఆశ్చర్యంగా.

"అదే నీకు తెల్సు. అసలు నా మొహాన నేను ఎం.బి.ఎ. కంప్లీట్ చేసి, జాబ్ చేసు కుంటుంటే, ఆ నా దొంగనా ప్రేమికుడు గోపి గాడు మన ప్రేమ విషయం మీ ఇంట్లో చెప్పు, చెప్పు అని నా దుంప తెంచాడు. సరే, వీడు నన్ను వదిలి వుండలేకపోతున్నాడూ, అంత ప్రేమించే వాడికి భార్య కావడం అదృష్టం అను కుని, వాడి మాట వినుకుని, మా నాన్నకి మాప్రేమ విషయం చెప్పేశాను. దాంతో మొదట నా చెంప పగిలింది. తర్వాత నా కొంప మునిగింది" చెప్పింది కావ్య కొంత అసహనంగా.

"ఏమైందో వివరంగా చెప్పవే" అడిగిం దామె.

"ఏముంది! నన్ను తాత్కాలికంగా ఉద్యోగం మాన్పించారు. తర్వాత ఓ సంబంధం చూసి నిశ్చితార్థం చేసేసి, ముహూర్తం కూడా పెట్టేశారు పెళ్ళికి. ఈ విషం ఆ దరిద్రుడు గోపీగాడికి చెప్తే ఏం పర్లేదు. నువ్వు పెళ్ళికి ఒప్పుకో. నేను పెళ్ళి ముహూర్తానికి కొంచెం సమయం ముందుగా వస్తాను. నిన్ను నాతో తీసుకువెళ్తాను. దానికి నా దగ్గర ఓ మాంచి ఐడియా వుంది. అదీ,ఇదీ. అని దిల్ వాలే దుల్హనియా లేజా యెంగే లో షారూక్‌లా పేద్ద డైలాగులు చెప్పాడు. నేనూ నమ్మాను."

"మరి తర్వాతే మైంది?" ఆసక్తి ప్రదర్శించింది షర్మిష.

"ఆ దరిద్రుడి బొందైంది. వాడు రాలేదు. మధు అనే ఓ సాఫ్ట్‌వేర్ ఇంజ నీర్‌కిచ్చి నన్ను కట్ట బెట్టారు. అదీ ఒకందుకు మంచిదే అయిందిలే."

"అంటే?" అడిగింది షర్మిష అమితా శ్చర్యంగా.

"ఏముందీ, ఆ గోపీ దరిద్రుడికి ఆ మధ్య ఓ పెళ్ళి సంబంధం వచ్చిందట. నేనుండగా వాడు ఆ పెళ్లి సంబంధం కుదుర్చుకున్నా, పెళ్ళి చేసుకున్నా, నేను వాడి దుంప తెంచు తానని భయపడి, నా అడ్డు తప్పించుకో వడానికి తెలివిగా మా ప్రేమ విషయం నాతోనే మా ఇంట్లో చెప్పించాడు. తర్వాత మా నాన్నకి ఆకాశరామన్నలా ఫోన్‌లు చేసి, ఈ పెళ్ళి జర గదు. తొందరగా చేయండి అని బెదిరిం చాడట. వాడి ఫ్రెండు చెప్పాడు. దాంతో నా






రెండవ తరగతి గణితపుస్తకాన్ని చూసి ఇది నాకు చాలా ఇష్టం అన్నాడొక అబ్బాయి.

'ఎందుకని' అడిగాను నేను.

'ఇందులో బొమ్మలు బాగున్నాయి' అంటూ గుండెలకు హత్తుకున్నాడు.

అవి చూస్తే చంద్రగారి బొమ్మలు.

చిన్న పిల్లల నుంచి పెద్దవాళ్ళదాకా ఇట్టే ఆకర్షించి కట్టి పడేసే చిత్రాలు ఆయనవి.

చంద్రగారి బొమ్మలు చూసినప్పుడల్లా మనసు ఉత్తేజభరితమవు తుంది. అంత అందంగా వేయాలనే జిజ్ఞాసను రేకెత్తిస్తాయి.

చంద్రుడు దగ్గరగా ఉన్నట్లే కనిపిస్తాడు గానీ.., అందుకోవడం సాధ్యమా!

హాస్యానందం చంద్రగారి ప్రత్యేక సంచికగా వచ్చి పాఠకులను ఆయన బొమ్మలు, కార్టూన్లు పలకరిస్తాయంటే నాలాంటి అభిమానులకు 'బొమ్మలకొలువు' పండగే కదా!

చందమామను చూస్తూ పిల్లలు కడుపునిండా అన్నం తిన్నట్లు... చంద్రగారి కార్టూన్లు చూస్తే మనసు నిండిపోతుంది.

నేలమీద ఉన్న ఈ చంద్రుడి బొమ్మలు నింగినున్న చంద్రుడున్నంత కాలం చల్లని వెన్నెల... నవ్వుల్ని పంచాలని కోరుకుంటూ... -నందు,భూదాన్‌పోచంపల్లి.




తక్కువ వ్యాఖ్యతోనే కాదు... మాటల్లేకుండా కార్టూన్లు గీసి, తన ప్రతిభని చాటుకుంటున్నారు చంద్ర.

కొన్ని కార్టూన్లను చూడగానే నాకు కవిత్వం పుట్టుకొస్తుంటుంది. అలాంటి కార్టూన్లను అందించిన వారిలో చంద్రగారు ఒకరు.

వ్యాఖ్య ఉన్న కార్టూన్లగురించి చెప్పుకునే కంటే వ్యాఖ్య లేని కార్టూన్లగురించే ఎక్కువ చెప్పుకోవాలి.

చంద్రగారి కార్టూన్లను చూడగానే మనలో కలిగిన భావాలను మాటల్లో వర్ణించలేం. కార్టూన్ చూడగానే ఆహా అనిపించినా... నవ్వు పెదవిపై విరిసినా... మనసంతా ఆనందంతో నిండిపోయినా... నిజంగా ఇలా అయితే బాగుండును అనిపించినా... అసలు ఈ ఐడియా చంద్రకు ఎలా వచ్చింది అని మనలో మనం ప్రశ్నించుకున్నా... అది గొప్ప కార్టూనే!

ఇలా వ్యాఖ్య రహిత కార్టూన్లలో చంద్రగారిది భిన్న శైలి.

చంద్రగారు సూర్యుడి మీద చాలా కార్టూన్లు గీసారు.

లోకానికి వెలుగునిస్తున్న సూర్యుడిపై కార్టూన్లు గీసి సూర్యుడికి కృతజ్ఞతలు చెప్పుకున్న చంద్రకు మనమూ శిరస్సువంచి నమస్కరిద్దాం!

-డా॥ రావెళ్ళ శ్రీనివాసరావు, విజయవాడ



పెళ్లి చాలా తొందరగా అయిపోయింది. దాంతో తర్వాత ఆ వెధవ ఆ డబ్బున్న పల్లెటూరి అమ్మాయితో పెళ్ళి సిద్ధమై పోయాడుట. అందుకే వాడి పెళ్ళి జరగకుండా చేశా. తిక్క కుదిరింది వెధవకి" చెప్పిందామె కసిగా.

"అదెలా కావ్యా?" అయోమయంగా ధ్వనించిది స్వరంలో.

"ఏముంది! వాడి ఫ్రెండ్‌కి ఐదువేలు పడేస్తే, వాడే గోపీగాడు పెళ్ళి చేసుకోవాలనుకున్న అమ్మాయి ఫోన్‌నెంబర్‌ని, వాడు బార్‌లో పూటుగా తాగాక దొంగిలించి నాకిచ్చేశాడు. నేను ఆ నంబర్‌కి ఒక్కకాల్ చేసానంతే. మటాష్" చెప్పింది కావ్య సంబరంగా.

"ఒక్క కాల్‌తో పెళ్ళి ఎలా తప్పించావు?"

"సింపుల్ వాడి పుట్టుమచ్చలు చెప్పానంతే" కన్నుగీటి హుషారుగా చెప్పింది కావ్య.

"అవి నువ్వెప్పుడు..." అంటూ నోరు నొక్కుకుంది పర్మిష.

కంగారుపడకు. మా కాలేజీ టూర్‌కి ఐదుకు వెళ్ళినప్పుడు వీడు ఆ వాటర్‌ఫాల్స్‌లో చిన్నషార్ట్‌తో స్నానం చేస్తూ, తెగ ఫోజు కొట్టాడు. అప్పుడుచూశాను" చెప్పడంతో పర్మిష కొయ్యబారింది మరి.

# 'చంద్ర' భావకిరణాలు....

చంద్రాగారిని ఇంటర్వ్యూ చేయాలని... జవాబుల కోసం ప్రశ్న విసిరితే.. చిటారికొమ్మలో పండు కోసం కింద నిలబడి రాయి విసిరినంత, వచ్చి... వచ్చి... కాయో... రాయో నెత్తి మీదపడచ్చు. అందుకని ప్రశ్నల రాయి విసరకుండా, కామెడీలో కార్టూన్‌గా జోకులో జవాబులా ఆ చెట్టుకింద నుండి ఏరుకొచ్చిన కొన్ని కొటేషన్స్ ఇక్కడ పేర్చుతున్నాం. ఇదే ఇంటర్వ్యూ అంతే పెట్టు.
ఇందులో చంద్రాగారి 65ఏళ్ల అనుభవాలు, అనుభూతులు,.అభిమాన విశేషాలు ముందుపెడుతున్నాం.

బొమ్మల చంద్రను సృష్టించిన బ్రహ్మలు శ్రీ రంగయ్య, శ్రీమతి సోమలక్ష్మి గారు.
సొంతఊరు– నన్నాసరి. ( వరంగల్ దగ్గర)
విద్యాభ్యాసం–అల్లరి చేస్తున్నాడని బళ్లో పడేస్తే రెండో క్లాసు నుండి బొమ్మల పిచ్చి గీతలు(ట)
అయిదవక్లాసు–డాక్టర్ నేరెళ్ల వేణుమాధవ్ క్లాసు టీచర్‌గా వరంగల్‌లో.
హైస్కూల్– హైదరాబాదు. అప్పుడే అసలు పేరు చంద్రశేఖర్ చంద్రశేఖర్‌గా మారింది. ఆ తర్వాత బొమ్మల చాంద్రమానం. సారీ చంద్రనామం.

మా అన్నయ్య ఫ్రెండ్ చంద్రశేఖర్ అని ఓ బాక్సర్ నాకు మోడల్ హీరో. అందుకే హెడ్మాస్టర్‌తో చంద్రశేఖర్ పేరే కావాలని పట్టుబట్టాను. ఆయన చంద్రశేఖర్ ఇంటిప్పేరికి వుండని పేరు అని చెప్పినా... నేనే గెల్చా!



నా ఆర్ట్ ప్రాక్టీసు అన్నీ బాపు బొమ్మలే. బాపుని బాపుగా చూడనప్పటి నుండే. నారాయణగూడలోవుమెన్స్ కాలేజీలో ఓసారి ఆ మహానుభావుడి ఆర్ట్ ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశారు. అమ్మాయిలు, అబ్బాయిలు, పెద్దాళ్లు, కుర్రాళ్లు బొమ్మలు చూసి ఆనందిస్తున్నారు.

ఓ మూల బోల్డుమంది అందమైన ఆడపిల్లలు ఒకాయన ఆటోగ్రాఫ్‌కి ఎగబడుతుంటే ఈర్ష్య పుట్టింది.

ఆడపిల్లలకి ఆటోగ్రాఫ్‌లు ఇవ్వడం కోసమైనా గొప్ప ఆర్టిస్టు అవ్వాలని అనేసుకున్నా. ఇంతకీ ఆ సంతకాలు పెడుతున్న అదృష్టవంతుడు బాపుగారు కాదు. సత్యమూర్తి.

'చదువుల్రావు సత్యమూర్తి.'

మరి బాపుగారెక్కడ. వెతికి పట్టుకున్నాను. ఓ కారు దగ్గర నలుగురు నిలబడి వున్నారు. కొందరి చేతిలో సిగరెట్లు వున్నాయి. 'ఇక్కడ బాపు ఎవరు' నా తెలంగాణ మాతృభాషలో అడిగాను. 'నేనే' అన్నాడు ఓ వ్యక్తి.

'ఇదిగో మీ బొమ్మలు నాకిష్టం. నీలా బొమ్మలు వెయ్యాలి. మీ ఇంటికొస్తాను నేర్పిస్తావా?' ఎలా అడిగానో ఇప్పుడు తల్చుకుంటే నవ్వొస్తుంది.

'ఏడాదిపాటు నా బొమ్మలు కాపీ చేయ్. ఆ తర్వాత నీకింకా కావాలంటే నేర్పిస్తాను. అన్నాడాయన. నమ్మేశ్శాను.

"గోపిచంద్‌గారి అబ్బాయి డాక్టర్ రమేష్ ఓ పత్రిక స్టార్ట్ చేశాడు. నేను వేసిన బొమ్మలు చూపిస్తే నవే వేస్తాను అన్నాడు. బొమ్మలు నచ్చాయి. బాపుబొమ్మలే కదా....! దీంట్లోంచి ఒకటి, దాంట్లోంచి ఒకటి కలిపి కాపీ చేశాను. అప్పు అయిపోయాయి.



హైదరాబాద్‌లో మా ఇంటి ప్రక్కన కొండపల్లిశేషగిరి రావుగారు వుండేవారు. ఆయన బొమ్మలు వేస్తుంటే చూడ్డానికి గొప్ప అవకాశం కల్గింది. ఆ స్టైలు కూడా నన్ను ఆవహించిందేమో! మా స్కూల్లో డ్రాయింగ్ పోటీలు పెడితే నేనో బొమ్మవేస్తే ఫస్టు ప్రైజ్ వచ్చింది. ఆ బొమ్మ నేను ఆయన ఇంట్లోంచి ఎత్తుకొచ్చానని శేషగిరిరావుగారు నన్ను దొంగని చేసి, యాగీ చేశారు. మీ చేత సన్మానం చేయించుకుంటాను అని మనస్సులోనే ఆయనతో సవాల్ వేసుకున్నా. అంత పని అయింది.

కొన్నేళ్ల క్రితం మమ్మల్ని ఇద్దర్ని ఒకే సభలోనే సత్క రించారు.



విరసంలో చాలా ఉత్సాహంగా ఉండేవాణ్ని. ఓసారి చెరబండ రాజు, జ్వాలాముఖి, గద్దర్, వి.నరసింగరావు, శ్రీశ్రీగారు అందరం ఓ సభకి వెళ్ళి వస్తున్నాం. ఆ సందర్భంగా నేను వేసిన బొమ్మలు తీసుకుని వస్తుండగా బస్‌లోంచి ఎగిరి కిందపడిపోయాయి. అక్కడే పనిచేస్తున్న కొంతమంది రైతులు వచ్చి వాటిని ఏరి నాకు అంద జేసారు. ఈ బొమ్మలు చూస్తే మీకేమనిపిస్తుంది? అని మావాళ్ళు అడిగారు? దానికి ఆ రైతులు రకరకాల సమాధానాలు ఇచ్చారు. నేను ఎవరికోసమైతే ఆ బొమ్మలు వేసానో వాళ్ళకే అవి అర్థంకాక పోతే నా బొమ్మలకు అర్థంలేదని, నా చిత్రకళ విరసానికి అక్కర్లే దని... 'విరసం'కి రాజీనామా చేసేసాను.





నేను బొమ్మలేసేటప్పుడు శృంగార చిత్రాలు వేస్తే నన్ నలుగురు చెప్పులు కొడుతుంటారు. రచనలో ఆ ఛాయ కనిపించినప్పుడు నేను బొమ్మను మరీ అష్టంగా వేస్తాను. మొన్నీ మధ్యన మూడువందల (అ) కార్టూన్లు వేసాను... ఓ ఫ్రెండ్ ఎత్తుకు పోయాడు.

ఇన్నాళ్ళలో నాకెందరో శాలువలు కప్పారు. చుట్టాలందరికీ ఇస్తూ వచ్చాను. ఇవన్నీ అడక్కుండా లభించినవే... ఒకసారిమాత్రం నాకు జరిగే పురస్కారం పక్కతోవ పడితే తిక్కరేగింది. తెలుగు యూని వర్శిటీవారు నాకో సంవత్సరం అవార్డు ప్రకటించినట్టు వార్త వచ్చింది. 'ప్రిస్టేజియస్ అవార్డే' అనుకున్నాను. జి.వి.సుబ్రహ్మణ్యం గారికి(వీసీ) మనస్సులోనే థ్యాంక్స్ చెప్పుకున్నాను. తీరా ఆ అవార్డు మరో ఆర్టిస్టుకి వెళ్ళిపోయింది. నాకు ఇస్తానని ఇవ్వకపోవడంతో అవమానంగా ఫీల్ అయ్యాను.... యాగి చేసాను... ఆ అవార్డు పోట్లాడి సంపాదించాను.



1999 లో మా అబ్బాయికోసం అమెరికా వెళ్ళినప్పుడు నా గురించి మావాడు చెప్పగా ఓ పత్రిక విలేఖరి మా ఇంటికి వచ్చింది. ఇవన్నీ మీరేసినవేనా అని రెండు మూడు సార్లు అడిగింది.

నిజమే తల్లి అని ఒట్టేసినంత పనిచేసాను.

ఆమె తన పత్రికలో నా గురించి రాస్తూ 'మనం రకరకాల స్టైల్లో బొమ్మలు చూడ్డానికి ఎన్నో మ్యూజియంలు తిరగా ల్సిన పని లేదు. చంద్రగారి బొమ్మలు చూస్తే చాలు!... అందులో క్లాసిక్...ఫోక్...మోడ్రన్ వాటిల్లో సబ్జెక్ట్స్ ఎన్నో కన్పిస్తాయి.' అని రాసింది.

నాటయ్యాక్లై కథలు రాస్తూ వుంటాను లెక్కలేనన్ని కార్టూన్లు వేసి వుంటాను. ఎన్నో ఇలస్ట్రేషన్స్ వేసాను కదా? నా దగ్గర ఏమి లేవు...పత్రిగ్గా... నెత్తిగ్గా...అదో...పదో... కథలు దొరకొచ్చు. బడాయి కాదుగానీ ఒక్క కార్టూన్ కూడా వెతికితే దొరకట్లేదు!

నాకు అయిష్టాలు చాలా వున్నాయి. చాలా ఇష్టాలు కూడా ఉన్నాయి. చాలా ఇష్టాల్లో చాలా చాలా శాతం రెండు అక్షరాలే 'బాపు!' ఆయనలా వేయడం నాకు రాదు. ఎవరికీ రాదు. ముఖ్యంగా దేవుడి బొమ్మలు వేయాలంటే ఆయనే వేయాలి. ఆయన బొమ్మలు కాపీకొట్టి నేర్చుకున్నాను. బాపు పేరెత్తిన ప్రతిసారి అప్రయత్నంగా దండం పెట్టేసుకోవడం కంట్రోల్ చేసుకుంటూ ఉంటాను.



అమెరికాలో మా అబ్బాయి బాస్ ఒకాయన వాళ్ళబ్బాయి ఫొటోని పోర్ట్రైట్ చేయమని ఇచ్చారు. ఒక చిన్న పిల్లాడు ఫిజికల్లీ, మెంటల్లీ హ్యాండీక్యాప్డ్' ఫొటోలో తెలిసిపోతున్నాడు. బొమ్మ పూర్తి అయి ఇచ్చేసాక తెలిసింది... అతను చాలా రోజుల క్రితమే చనిపోయి నట్లు. అయితే వాళ్ళింట్లో ఆ బొమ్మ అందరికీ అద్భుతంగా నచ్చి సజీవంగా అన్పించింది కానీ ఆ పిల్లాడు తల్లిమాత్రం ఆ బొమ్మని ఇంట్లో పెట్టడానికి ఒప్పుకోలేదు. దానికి కారణం అంత జీవంతో వున్న ఆ 'బొమ్మ'ని ఆ కన్నతల్లి మనసు బెంగపడి చూడ్డానికి ఇష్ట పడలేదు. మా అబ్బాయి బాస్ 500డాలర్ల చెక్ పంపించాడు. నేను రిజక్ట్ చేశా! ఆ తల్లి బాధతో మెప్పుకోలు కన్నా ఆ డబ్బులు నాకు ఎక్కువ అన్పించలేదు.



యూనివర్సిటీ ఆఫ్ తైవాన్‌లో నా బొమ్మ ఒకటి ఉంటుంది. ఒక గిరి కన్యని చిత్రించాను. ఆమె కను గుడ్లలో గ్లోబుని చిత్రిం చటం వార్ కెంతో నచ్చింది.

చాలా గొప్పబొమ్మలేసాను. తృప్తిగా ఉంటుంది. చాలా మంది గొప్పవాళ్ళు నాకు డబ్బులు బాకీ పడ్డారు. మరీ తృప్తిగా ఉంటుంది.



హాస్యానందం ప్రత్యేక సంచిక వేస్తుందని కార్టూన్స్ గట్రా కావాలని అంటే... ఏమీ లేవు మీ తిప్పలు మీవే! అన్నా. టీం ఇంటర్వ్యూ చేస్తారు... 'అన్నా అతన్తో సరదాగా మాట్లా డటం నాకు 'హాబీ' అన్నాను. ఫొటోలకి ప్రేమగా ఓకే అన్నా!...
థ్యాంక్యూ ఆల్ & ఆలీ!

హాస్యానందం ఫుల్ పిల్లర్ టీం గారి రూంలో చంద్రగారు ముచ్చటించిన విషయాలు విని... సేకరణ.... యు. మల్లికార్జున.




జరిగిన కథ: బస్టాప్‌లో బస్ కోసం ఎదురు చూస్తుండగా ఒక అందమైన అమ్మాయి చిట్టిబాబుని చూసి నవ్వుతుంది. ఆమె ఎందుకు నవ్వుతుందో అర్థం కాక ఎదుటి వాళ్ళు మనసులో అనుకున్నది తెలిస్తే ఎంతబాగుంటుందో అనుకుంటాడు. అలా అనుకోగానే ఎదుటివాళ్ళు అనుకుంటున్నవన్నీ చిట్టిబాబుకి తెలిసి పోతుంటాయి. బస్టాప్‌లో కనిపించిన అమ్మాయితో చిట్టిబాబు పెళ్ళి జరుగుతుంది. అయితే మొదటిరాత్రి ఆ అమ్మాయి మనసులో అనుకుంటుందంతా తెలిసి చాలా బాధపడ్డారు చిట్టిబాబు. అలా భార్య మనసులో తన గురించి అనుకున్నవి తెలుసుకుని భార్యాభర్తలిద్దరూ గొడవ పడ్తుంటారు. —ఇకచదవండి

**"ఎందుకమ్మాయ్... అలా గొడవని పెంచుకుంటూ పోతావ్? నువ్ నీ మనసుని నిష్కల్మషంగా వుంచుకుంటే పోలా?" అంది తాయారమ్మ తేలిగ్గా.**

**"అలా వుంచుకోవడం నావల్లకాదు" తెగేసినట్టే చెప్పింది రుద్రమ. "మీవల్ల అవుతుందా?" అన్నట్టుగా కూడా చూసింది.**

**"నీవల్ల కాకపోతే నీ పుట్టింటికిపో... అంతే గానీ ప్రతిక్షణం నన్నిలా టార్చర్ చెయ్యొద్దు..." అన్నాడు చిట్టిబాబు విసురుగా కూర్చుంటూ.**

**"ఎవరు ఎవర్ని టార్చర్ చేస్తున్నారండీ? అసలు నేను గాబట్టి వేగ్గలుగుతున్నాను మీతో..." కొరకొరా చూస్తూ అంది రుద్రమ.**

**"అంటే! నేను నిన్ను టార్చర్ చేస్తున్నానా?"**

**"కాక, మరేం చేస్తున్నట్టు? కొత్తపెళ్ళాన్ని ఎంతో మోజుగా చూసుకుంటారెవరైనా! కానీ, మీరేం చేస్తున్నారు? రోజూ జగడమే! ఏరోజు సుఖపెట్టారు నన్ను?"**

"ఏదీ, నువ్ సుఖపెట్టనిస్తుంటే కదా?"

"అదేదో సామెత చెప్పినట్టుగా వుందది"

"ఏవిటో ఆ సామెత?"

"ఎందుకులెండి. చెబితే మీరు తలకొట్టుకుని చచ్చిపోతారు..." రుద్రమ అలా అనేసరికి, ఆ సామెత ఏంటో తెలిసి రాలేదుగానీ మొత్తానికయితే అదేదో మొగుడికసామెతో, బూతుసామెతో అని మాత్రం అర్థమైంది చిట్టిబాబుకి.

ఇన్‌డైరెక్ట్‌గా ఆమె తన మగతానన్నే సవాలు చేస్తున్నట్టుగా అనిపించి "ఛ" అన్నాడు తల కొట్టుకుంటూ.

"తలకొట్టుకుని చావాల్సింది నేను. మీరు కాదు. అసలు మీరెందుకూ తలకొట్టుకోవడం?" అంది రుద్రమ చేతులు తిప్పుతూ విసుగ్గా, విసురుగా!

"ఏంటమ్మా ఆ మాటలు?" అని తాయారమ్మ ఇంకా ఏదో అనబోతుంటే, "మీరు కల్పించుకోకండత్తయ్యా! ఇది మా స్వవిషయం. మేం మేం తేల్చుకుంటాం" అనేసింది రుద్రమ.

ఆమె తన తల్లిని అలా తీసిపారేస్తుంటే సహించలేకపోయాడు చిట్టిబాబు.

"ఆవిడ మా అమ్మ. కల్పించుకోకుండా ఎందుకుంటుంది?" అన్నాడు రోషంగా.

"అంటే, ఏంటి మీరనేది? ఇన్నాళ్ళూ మీరొక్కరే అనుకున్నాను. ఇప్పుడు మీరూ, మీ అమ్మా కలిసి జాయింట్‌గా నెప్పుకు తింటారా నన్ను?" అనేసింది రుద్రమ కోపంలో తాను ఏమంటున్నదీ తనకే తెలియని స్థితిలో.

ఆ మాటలు సహజంగానే తాయారమ్మని మండిపడేలా చేశాయ్.

"నీ కళ్ళకి మేం మనుష్యుల్ని తినే రాక్షసుల్లా కనిపిస్తున్నామా?" అంది కోపంగా.

అడిగిందానికి బదులివ్వకుండా— "ఛీ! ఈ ఇంట్లో నాకు సుఖమన్నదే లేదు. నేనింక ఒక్క క్షణంకూడా వుండనిక్కడ..." అనేసి విసురుగా అక్కడినుంచి వెళ్ళిపోయింది రుద్రమ.

అనుకోని ఈ పరిణామానికి నిశ్చేష్టుల య్యారు ఆ తల్లీకొడుకులిద్దరూ.

'కొంపదీసి నిజంగానే వెళ్ళిపోతుందా ఏమిటి?" అనుకుంది తాయారమ్మ.

అది గ్రహించి 'పోతే పోనీయమ్మా!' అన్నాడు చిట్టిబాబు రోషంగా.

తాయారమ్మ సందేహాన్నే నిజం చేస్తూ ఓ రెండు నిముషాల్లో చేతిలో ఓ సూట్‌కేస్‌తో అక్కడికొచ్చింది రుద్రమ.

"నేను మా పుట్టింటికి వెళుతున్నాను. ఇంక చచ్చినా తిరిగి రాను."

ఆమె అలా అంటుంటే మండిపోయింది చిట్టిబాబుకి.

"పోతే పో... ఎవర్ని బెదిరిస్తావ్?" అనేశాడు కోపంగా.

"రేయ్ రేయ్ ఏంట్రా అది? ఆగమను..." అని కొడుకుతో ఇంకా ఏదో చెప్పబోయింది తాయారమ్మ.

కానీ,రుద్రమ అప్పటికే ఆ ఇంటిగడప

దాటేసింది.

'ఇలా జరిగిందేమిటి? పెళ్ళయి నిండా నెలయినా దాటకముందే అప్పుడే ఈ గడప దాటడాలేమిటి? ఈ విడిపోవడాలేమిటి?' అనుకుంది తాయారమ్మ.

"ఇప్పుడేం కొంపలంటుకుపోలేదులే..." అనేశాడు చిట్టిబాబు అది గ్రహించి.

"కొంపలంటుకుపోలేదంటావేంట్రా? ఇంత వేగిరం మీ మధ్య ఇలాటి గొడవలు వచ్చాయని తెలిస్తే నలుగురూ నవ్విపోరూ?... ముఖాన ఊయరూ! బాబ్బాబు, వెళ్ళి దాన్ని బ్రతిమాలి వెనక్కి తీసుకురా... పో" అంది తాయారమ్మ గాభరాగా.

కోడలిమీద ప్రేమ ముంచుకొచ్చి కాక పోయినా లోకానికయినా భయపడాలిగా!

"మొగుడూ, అత్తగారూ కలిసి ఎంతగా అరడి పెట్టుండకపోతే ఆ పిల్ల ఇలా చేస్తుందని నలుగురూ అనుకుంటే... అనుకుంటే ఏంటే, అనుకుని తీరుతారు? ఆ అప్రదిష్ట మనకేగా!"

తల్లి అలా అంతదూరం ఆలో చించి చెబు తూంటే చిట్టిబాబుకి ఏం నచ్చలేదు.

"నేనెళ్ళి బ్రతిమాలి తీసుకు రావాల్నా! ఛస్తే వెళ్ళను..." అనేశాడు భీష్మించుకున్నట్టు.

"అది కాదురా నాయనా! అందరూ మనల్నే ఆడిపోసు కుంటారు..." అంటూ రుద్రమని పుదు వెనక్కి పిలుచుకు రావలసిన అవశ్య కతని వివరంగా చెప్పు కొచ్చింది తాయారమ్మ.

అయినప్పటికీ కన్విన్స్ కాలేదు చిట్టిబాబు.

"దానికి మతిలేక వెళితే మనమా అందుకు బాధ్యులం?" అన్నాడు తిరస్కారంగా.

"దానికి మతి వుండే వెళ్ళిందో, లేక వెళ్ళిం దో అవన్నీ ఇతరులకి ఏం తెలుస్తాయ్? మనమే ఏదో చేసుంటామనుకుంటారు. అందునా ఈమధ్య గృహహింస చట్టమో, నా పాడో ఏదో వచ్చిందట కూడా! నిర్దాక్షిణ్యంగా తీసుకెళ్ళి జైల్లో వేస్తున్నారట. ఎందుకొచ్చిన తగలాటకం అదంతా! నా మాటవిని వెళ్ళి దాన్ని వెనక్కి పిల్చుకు రారా..." అంది తాయారమ్మ బ్రతిమాలుతూ.

దాంతో తల్లిమాటను మన్నిస్తూ చిట్టిబాబు బయటకు దారితీశాడు.

రుద్రమ కనిపించలేదు.

పరుగు పరుగున వెళ్ళి వీధిమలుపు తిరిగాడు.

అల్లంత దూరంలో రుద్రమ విసవిసా నడిచి వెళుతూ కనిపించింది.

'హమ్మయ్య! నయం, కారులోనో, ఆటోలోనో వెళ్ళలేదు...' అనుకుంటూ ఆమెను దొరకబుచ్చుకున్న చిట్టిబాబు, ఎంతగానో బ్రతిమాలాడాడు వెనక్కు తిరిగి వచ్చేయమని.

కానీ, రుద్రమ వినిపించుకోలేదు.

"నేను రాను... రానంటే రాను.. మీలో ఆ దిక్కుమాలిన శక్తి ఉన్నంత కాలం నేను మీతో కలిసి కాపురం చెయ్యడం అసాధ్యం...." అనేసింది ఖచ్చితంగా. అతని చేతిని విదిలించి కొడుతూ.

"పోనీ కలిసి కాపురం చెయ్యొద్దు. వెనక్కొ



చ్చేసి నీ మట్టుకు నువ్వు వుండు. ఇంత త్వరగా మనం విడిపోతే అందరూ రకరకాలుగా అనుకుంటారు..." తల్లిమాటల్ని మనసులోకి తెచ్చుకుంటూ రిక్వెస్ట్ చేశాడు చిట్టిబాబు.

"కలిసి కాపురం చెయ్యనప్పుడు నేనొచ్చి ఆ కొంపలో చావడం దేనికి?" తిరస్కారంగా అంది రుద్రమ.

"ప్లీజ్ రుద్దూ! ఎలాగోలా ఆ శక్తిని పోగొట్టుకోవడానికి ప్రయత్నిస్తాను. దయచేసి కొంచెం తెలివిగా ఆలోచించు. ఎలాగోలా కొద్ది రోజులు ఓపికపట్టు... ఆపైన మనకంతా మంచిరోజులే. నామాట విను. నాకా నమ్మకం వుంది..." దీనంగా పలికాడు చివరిమాటల్ని చిట్టిబాబు.




"ఏమవుతుంది కొద్దిరోజులు ఓపిక పడితే?"

"చెప్పానుగా! ఎలాగోలా ఆ శక్తిని వొదిలించుకుంటానని!"

"ఎలా వదిలించుకుంటారు?"

"నాకిచ్చిన శక్తిని వెనక్కితీసేసుకోమని ఆ తథాస్తు దేవతల్ని ప్రార్థిస్తాను... వేడుకుంటాను."

"ఒకవేళ వాళ్ళు మీ ప్రార్థనని ఆలకించక పోతే?"

రుద్రమ ధోరణికి ఒళ్ళు మండింది గానీ అయినా ఎలాగో తమాయించుకున్నాడు చిట్టిబాబు.

"ఎందుకు ఆలకించరూ?" అన్నాడు 'రూ'ని సాగదీస్తూ.

"దేవతలు? ఒక్కసారి ఇచ్చిన వరాన్ని వెనక్కు తీసుకోరని ఎక్కడో చదివాను" అంది రుద్రమ.

"ఎందుకని తీసుకోరూ?" అన్నాడు అయోమయంగా చిట్టిబాబు.

"ఇటీజ్ క్వయిట్ నేచురల్. మనం ఎవరికైనా ఏదైనా దానమిస్తే మళ్ళీ వెనక్కి తీసుకుంటామా? అలాగే ఇదీనూ!" అంది రుద్రమ సూట్‌కేసును క్రిందకి దింపుతూ.

ఆ దేవతల సంగతేమోగానీ ఈవిడగారు మాత్రం భలే ఫిట్టింగ్ పెడుతుందనుకొని-

"అలాగేం జరగదులే. నేను వాళ్ళని దీనాతి దీనంగా వేడుకుంటా! నీకెందుకూ నువ్ వెనక్కొచ్చెసెయ్...." అన్నాడు చిట్టిబాబు.

"ఎందుకూ? అలాగెందుకనుకున్నావ్? ఇలాగెందుకనుకున్నావ్? అని చెప్పుకు తింటానికా?" అనుకుంది రుద్రమ మనసులో.

"ఛ ఛ! ఇకనుంచి అలాగేం వేధించను. నువ్ నన్ను మనసులో బండబూతులు తిట్టుకున్నా కూడా పట్టించుకోను... సరేనా?" గద్గదిక స్వరంతో అన్నాడు చిట్టిబాబు.

"అదేమాటమీద మీరెప్పటికీ వుండగలరా?" క్రింద వుంచిన సూట్‌కేసుని కుడిచేత్తో తీసుకుని, ఎడమచేతిలోకి మార్చుకుంటూ అడిగింది రుద్రమ.

"ఉండగలను... కావాలంటే, ఇప్పుడే టెస్ట్ చేసుకో నన్ను. మంచిబాలుడులా చేతులు కట్టుకుంటూ బుద్ధిగా అన్నాడు చిట్టిబాబు.

"ఒకవేళ మాట తప్పితే?"

"తప్పుతానంటున్నానా? కావాలంటే టెస్ట్ చేసుకోమంటున్నాగా?" దీనంగా చూస్తూ అతనలా అంటుంటే ఒకింత మెత్తబడింది రుద్రమ.

"సరే టెస్ట్‌చేస్తున్నా కాస్కోండి..." అంది ఛాలెంజింగ్‌గా.

"ఇక్కడెందుకూ? నడిరోడ్డుమీద బాగుండదు. ఇప్పటికే అందరూ మనల్నే చూస్తున్నారు. ఇంటికి వెళ్ళాక చేద్దువులే టెస్టు..." అన్నాడు చిట్టిబాబు.

"నథింగ్ డూయింగ్! ఇక్కడే తేల్చుకుంటాను మీ వ్యవహారం!" మొండిగా అంది రుద్రమ.

**(సశేషం)**





శ్రీ చంద్ర గారంటే... నాకెంతో గౌరవం. ఆయన బొమ్మ లన్నా, కార్టూన్లన్నా నాకెంతో ఇష్టం. ఆయన బొమ్మలులో ఎనాటమీ అద్భుతంగా వుంటుంది. కార్టూన్లు బొమ్మలు... ఎంత అందంగా, ముద్దుగా వుంటాయంటే వాటి గీత ల్లోంచి ఒక్కగీతను తీసినా, నిండుదనం పోతుంది. ప్రతీ గీతలోనూ అంత అందం వుంటుంది. వికారంగా గీయటం తెలియదు, రాదు.

శ్రీ చంద్రగారు బహుముఖ ప్రజ్ఞాశాలి... ఫిలిం డైరెక్టర్‌గా, ఆర్ట్ డైరెక్టర్‌గా, నటుడుగా, రచయితగా, పెయింటర్‌గా, చిత్రకారునిగా, కార్టూనిస్ట్‌గా ఆయన ఉద్దండులు. వీటికి మించి వ్యక్తిగా, ఎంతో సౌమ్యుడు, స్నేహశీలి, మృదుస్వభావి, నిగర్వి.

శ్రీచంద్రగారు ఏం చదివారో తెలియదుగాని, జీవితాన్ని, ప్రపంచాన్ని బాగా చదివారని పిస్తుంది. ఈ విషయం ఆయన సృష్టించిన కార్టూన్లుచూస్తే తెలుస్తుంది.

సూపర్బ్! ఆయన కార్టూన్లు... అతి తక్కువ కాప్షన్‌తో, కాప్షన్‌లెస్ కార్టూన్లు అందంగా ముద్దుగా వుంటాయి. ఆయన కాప్షన్‌లెస్ కార్టూన్లు చాలా ఎక్కువగా గీశారు. అన్నీ... అద్భుతంగా వుంటాయి. ఆయన కార్టూన్ల శైలి అనుకరించడం చాలాకష్టం. వారి కార్టూన్ల ప్రేరణతోనే... నేను కూడా కార్టూన్లు అందంగా గీయడాన్ని ప్రయత్నిస్తున్నాను. (అసాధ్యం మని తెలిసికూడా). ప్రయత్నిస్తూనే వుంటాను.

ద గ్రేట్ చంద్రగారి ప్రత్యేక సంచికగా రావటం చాలా ఆనందకర విషయం. స్వాగతం... తెస్తున్న హాస్యానందం రాముగార్కి ఆనందాభివందనాలు.

శ్రీచంద్రగారు ఇంకా ఎన్నో... అద్భుతమైన బొమ్మలు, కార్టూన్లు సృష్టిస్తూ నిండుగా నూరేళ్ళు ఆనందంగా, ప్రశాంతంగా వుండాలని కోరుకుంటూ గురువుగారి పాదాలకు నమస్కరిస్తున్నాను.

–గోపాలకృష్ణ(కార్టూనిస్ట్)





## చిత్రకళా వెన్నెల – చంద్ర

–రాంపా

పిండారబోసినట్టున్న వేదిక! అది తెల్ల కాయితం కావచ్చు, కార్టూను కావచ్చు, బోర్డు కావచ్చు!

సృజనాత్మకమైన మనసుకి రూపు దిద్దే చేయి, చేతిలో పెన్సిలు! ఆ తెలుపుమీద గీతల మేఘాలు అలముకుంటాయి, పులుము కుంటాయి!

నలుపురంగులో ముంచిన కుంచె ఆ మేఘాల్లో కదులుతుంది. నాట్యం చేస్తుంది! కాగానే ఎరేజర్ చేతికొస్తుంది. మేఘాల దుప్పటి తొలగిస్తుంది. క్షణంలో అందమైన బొమ్మ ప్రత్యక్షమవుతుంది! ఆనందంతో మనసు నిండిపోతుంది!

చంద్ర కళలో బొమ్మ అలా పురుడు పోసు కుంటుంది. అది కార్టూనైనా అందం తెలివి కలగలిపి ఆవిష్కృతమవుతాయి.

ప్రతి గీత, ప్రతి బొమ్మ ఎంత అందంగా వుంటుందో అక్షర చిత్రీకరణలో కూడా ఏకా గ్రత, శ్రద్ధ చంద్ర అనే పేరుతో తపస్సు చేస్తాయి. అలా ఎన్నో కథల శీర్షికలు సాహితీ సుందరాలై మెరిశాయి. చంద్రహారాలు వేసు కున్నాయి.

బాపు రేఖాలయంలో ఉత్తేరణ పొందినా అనుకరించి అగౌరవపరచకుండా తనదైన శైలిని అలవరచుకున్న, కళపరుచుకున్న చిత్ర కళారాధన చంద్ర!

చిత్రకళాస్థాయి తగ్గకుండా 'ఎ' బొమ్మలు వేయడంలో ఎ ప్లస్ చంద్ర!

ఆ చంద్రుడి వలెనే ఈ చంద్రడికీ ఓ మచ్చ వుంది. అది గుచ్చుతుంది. గుచ్చుకుంటుంది.

ఎంత అలజడి చేసినా చివరికి ప్రశాంత మైన చంద్ర మనసే గెలుస్తుంది. ఆత్మీయతై పిలుస్తుంది. ఆప్యాయతై నిలుస్తుంది. దూరం అవుతుంది. దగ్గరను మరచిపోదు.

చంద్ర కలవరం! చంద్రకళవరం!



నవ్వుల రారాజు

ఫ్లాష్‌బ్యాక్

# చార్లీచాప్లిన్ దగ్రేట్!


విష్ణుభొట్ల రామకృష్ణ

ఫోన్: 9 4 4 0 6 1 8 1 2 2


**అమావాస్య తర్వాత పౌర్ణమి, చీకటి తర్వాత వెలుగు ఎలా వస్తాయో మనిషి జీవితంలో కొంతకాలంపాటు సంతోషం, తర్వాత దుఃఖం కొనసాగుతుంది. ఇది సహజం. కానీ చాప్లిన్ జీవితంలో సంతోషం కన్నా దుఃఖమే ఎక్కువగా కనబడుతుంది.**

**ఆయన జీవితంలో సుఖం రెండగులు వేస్తే, దుఃఖం నాలుగు అడుగులు వేస్తుంది. చాప్లిన్ జీవిత గమనంలో విజయాలు మెరుపులా ఇలా వచ్చి అలా వెళ్ళిపోయాయి. అపజయాలు మాత్రం నీడలా అవి వెన్నంటి వున్నాయి అన్నందుకు ఎన్నో సంఘటనలు ఉదాహరణలు.**

సినిమా రంగంలో అప్పుడప్పుడే విజయ పరంపరతో నిలదొక్కుకుంటున్న చాప్లిన్‌కు అనుకోని వరంలా ఒక సంఘటన జరిగింది. 'ఎస్సనీ' కంపెనీ ప్రతినిధిగా బెన్‌రాబిన్స్ చాప్లిన్ కలిశాడు. ఎస్సన్నీ కంపెనీలో నటిస్తే వారానికి 1250 డాలర్ల జీతంతో కాంట్రాక్టు కుదిరితే, పదివేల డాలర్లు బోనస్‌గా ఇస్తానని ఈ కాంట్రాక్టును ఒప్పందం కుదుర్చుకుందామని ప్రతిపాదించాడు.

ఈ వార్త చాప్లిన్‌కు ఒక్కసారిగా ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని కల్గించాయి. తన జీవితంలో ఇంత గొప్ప అవకాశం రావటం ఇదే మొదటిసారి. ఇది తన జీవితాన్ని మలుపు తిప్పుతుందని భావించాడు చాప్లిన్. వెంటనే తాను పని చేస్తున్న 'కీ స్టోన్' కంపెనీని వదిలి కొత్తకంపెనీలో చేరాడు.

ఎస్సన్నీ కంపెనీవారు చాప్లిన్‌తో వెంటనే సినిమాలుతీయటం ప్రారంభించారు. వారు అతనితో తీసిన చిత్రం హిజ్ న్యూ జాబ్.

ఈ చిత్రం మొత్తం వారు చకచక పూర్తి చేశారు. కాని చాప్లిన్‌కు వారం, వారం ఇవ్వవలసిన జీతం కాని, బోనస్‌కాని సయాపైసా ఇవ్వలేదు. దానితో ఎస్సనీ కంపెనీ తనను మోసం చేసిందని చాప్లిన్‌కు అర్థం అయింది.

తనకు రావలసిన మొత్తం గురించి కంపెనీ వారిని ఎన్నిసార్లు అడిగినా సరైన సమాధానం రాలేదు. దానితో వారితో తగాదా పడి ఎస్సనీ కంపెనీనుండి బైటొలిగాడు.

ఆ తర్వాత మరో పెద్ద కంపెనీ మ్యూచువల్ యజమాని అండర్‌సన్ చాప్లిన్‌ను కలిసి తన కంపెనీలో నటించమన్నాడు.

అండర్‌సన్ అప్పటికే వెస్ట్రన్ చిత్రాలు తీస్తున్న అనుభవం వుంది. పెద్ద కంపెనీ, దానికి తోడు మంచి జీతం ఇస్తానని చాప్లిన్‌తో ఒప్పందం కుదుర్చుకున్నాడు. ఎస్సన్నీ కంపెనీలో నటించి నష్టపోయినందుకు... మరో మంచి కంపెనీలో అవకాశం వచ్చినందుకు సంతోష పడి మ్యూచువల్ కంపెనీ సినిమాలో నటించ



టానికి ఒప్పుకొన్నాడు చాప్లిన్.

కొత్త కంపెనీ ఫ్రాంకోబిల్లి వారు చాప్లిన్ చేత దాదాపు నాలుగు చిత్రాలు తీశారు.

అందులో హిజ్ నైట్ అవుట్ చిత్రం ముఖ్యమైనది. ఫ్రాంకోబిల్లి కంపెనీవారు పారితోషికం విషయంలో ఇబ్బంది పెట్టకపోయినా అతనికి స్టూడియోలు సరైన వసతులు కల్పించటంలో చాలా ఇబ్బందులు పెట్టారు. ఆ కంపెనీలో నటించిన నాలుగు చిత్రాలకు తాను పడిన ఇబ్బందులను చాప్లిన్ అండర్‌సన్ దృష్టికి తీసుకెళ్ళాడు.

కాని అండర్‌సన్ అతనికి వసతులు కల్పించటంలో విఫలమయ్యాడు.

దానితో చాప్లిన్ విసుగు చెంది లాస్‌ఏంజిలిస్‌కు వెళ్ళి అక్కడ చిన్నస్టూడియోను అద్దెకు తీసుకొన్నాడు.

కంపెనీలలో అతని అదృష్టం వక్రీకొట్టినా... అతను నటించిన సినిమాలు మాత్రం ప్రజలలో బాగా పేరును సంపాదించి పెట్టాయి.

చాప్లిన్ నటించిన ప్రతిచిత్రం ప్రతి సినిమా హాలులో విజయవంతంగా నడిచాయి. చాప్లిన్ నటించిన సినిమా రెండురీళ్ళను మించి వుండకపోయినా... సినిమాలను తమ సినిమా హాలులో ప్రదర్శించటానికి ఆటకు 50 డాలర్లు ఇవ్వటానికి పోటీపడేవారు. ఇలా చాప్లిన్‌కు సినిమా ప్రదర్శన విజయవంతం అవటం ద్వారా అదృష్టం కలిసివచ్చింది.

సముద్ర కెరటాల నడుమ నావ వలే, సినిమాలు, స్టూడియోల మధ్య అదృష్టం, దురదృష్టాలతో చాప్లిన్ జీవితం సాగిపోసాగింది.

ఇంతలో మరో అదృష్టం అతని తలుపు తట్టింది. ఆ అదృష్టాన్ని అతను కలలోకూడ ఊహించి వుండడు. అయినా అదృష్టంకాని దురదృష్టం కాని చెప్పి రావుగా?

అనుకోకుండా ఒకరోజు సాయంత్రం చాప్లిన్‌కు ఒక టెలిగ్రామ్ న్యూయార్క్‌నుండి వచ్చింది. ఆ టెలిగ్రామ్‌లో వున్న విషయం ఏమిటంటే రెండు వారాలపాటు ప్రతి సాయంత్రం కెమెరాముందు పదినుండి పదిహేను నిమిషాలు నిలబడి నటిస్తే చాలు. దానికి పారితోషికం 25,000 డాలర్లు ఇస్తాం అని వుంది. అనుకోని ఈ అదృష్టాన్ని చాప్లిన్ గొప్ప వరంగా భావించాడు. (సశేషం)



## సోయగాల 'చంద్ర'లేఖ

**2001** లో ఓ సభలో ప్రజాశక్తి చిత్రకారునిగా పాల్గొనేందుకు వెళ్ళిన సందర్భంలో... శ్రీ చంద్రగారిని మొదట చూడడం జరిగింది. వారి రేఖలంత అందగా ఉండే వారి స్ఫురద్రూపం చూసి నా శరీరం నిండా పులకాంకురాలు... ఒక్కసారన్నా వారిని చూడాలన్న ఎన్నో ఏళ్ళ కోరిక సునాయాసంగా తీరడం ఎంతో తృప్తినిచ్చిన అంశం. ప్రముఖ రచయిత పి.చంద్రశేఖర అజాద్‌గారు నన్ను చంద్రగారికి పరిచయం చేస్తూ- "మనవాడే.. ఏవైనా రెండు సలహాలివ్వు..." అనగానే, "అలాగా అయితే ఇటు రా..." అంటూ నన్ను ఆ గుంపుకి దూరంగా తీసుకెళుతుంటే ... ఏదో గగుర్పాటు కలిగింది.

"ఇక్కడాగు.." అంటూ ఓ చోట ఇంటర్వ్యూలాంటి ప్రశ్నల్తో నిలబెట్టారు. నాలో ఏదో గౌరవంతో కూడుకున్న భయంలాంటి భావన...!

ఆ ప్రశ్నల పరంపరకి నా నుండి ఒకటే సమాధానం- "లేదు" అని.

ఎన్నో ప్రశ్నలు... వాటిలో ఒకటి-"ఎప్పుడైనా అందమైన అమ్మాయిని చూశావా?" అన్నీ విన్నాక ఆయన నాకు చేసి ఉద్బోధ ఒక 'దేవరహస్యం!'

వారి రేఖలు పరుగులు పెడుతుంటే చూస్తూ ముచ్చటపడనివారు ఆంధ్రదేశంలో ఉండరేమో...!

సోయగాల చంద్రలేఖలకు ఆకర్షితం కాని హృదయం ఎక్కడుంటుంది?!

ఆ తరువాత 'డైవమ్' మాసపత్రికలో సంపాదకవర్గసభ్యునిగా చంద్రగారి పునర్దర్శన భాగ్యం కలిగింది. అందులో నేను వ్రాసిన భక్తరామదాసు ధారావాహికను చూపించాను. "రాత- గీత- చేత- మరింకేం?!" అంటూ ఓ అభినందన! అది తలచుకుంటూ ఎన్ని రోజులు పొంగిపోయానో...!

మరోసారి ఋషిపీఠంలో... కవిరాజు, అజాద్, చంద్రగార్లు నా ద్వారానే శ్రీ సామవేదం షణ్ముఖశర్మగారిని కలియడం... ఆ సందర్భంలో "ఇక్కడ కూడానా...?" అంటూ మరో ప్రశంస. దీవెనలు ఇలా కూడా వర్షిస్తాయని అనుభవమయ్యింది.

ఎన్నోసార్లు చిక్కడపల్లి 'వరద' మెస్‌లో నమస్కారాలు పెట్టుకునే అవకాశం... ఓసారి నన్ను కట్టిపడేసే ఓ మాట – ఓ కథ చెప్పి, "దీని పేరు ఇండిపెండెన్స్. రచయిత బి.శశి. ఈ ఆంధ్రదేశంలో ఎక్కడో ఒక దగ్గరుంటాడు. అతడెక్కడుంటాడో వెతికి పట్టుకుని, వెళ్ళి కాళ్ళకి దండం పెట్టి వచ్చి నాతో మాట్లాడండి" అని.

చిత్రకారుడిగానే కాక, రచయితగా కూడా లబ్ధప్రతిష్ఠులైన శ్రీ చంద్రగారు ఓ రచనను ఏ విధంగా దర్శిస్తారో ఈ సంఘటనలో అర్థమవుతుంది.

భయపడుతూనే (?) వారిని ఎందరో ఆరాధిస్తుంటారు.

వారి రేఖావైచిత్రి నాకు ఎంతో ప్రేరణనిచ్చేది. ఓ సారి 'రాసలీల'ను గేయబద్ధం చేసినపుడు చంద్రగారి చేతిలో మలచబడిన సుందరాంగుల చిత్రాలనే స్ఫూర్తిగా గ్రహించాను...

**"మదనుడి విల్లై వంగెను**
**మధుమయ మోహిని రాధ**
**మదన కదన కౌతుహాల**
**మదనునయ్య కరాల"** అంటూ చరణాల పరుగులు పెట్టినప్పుడు చంద్రగారికి మనసు నిండా కృతజ్ఞతలు చెప్పుకున్నాను.

వారి పరిచయ భాగ్యానికి పొంగిపోతూ... వారిచ్చే ప్రేరణకు నిత్యం కృతార్థుడనవుతూ ధన్యవాదాలు.

**– తుంబలి శివాజీ**

# ఒక చంద్రావలోకనం

-తల్లావఝ్ఝుల శివాజీ



ఆధునిక కళల్లో 'కార్టూన్' ఒకటి. మన దేశంలో, ముఖ్యంగా మన రాష్ట్రంలో, కార్టూన్ చాలా ఆలస్యంగా మొదలయింది. హంపీ నగరం గోడలమీద ఫ్రెస్కో బొమ్మల్లో మొదటి కేరికేచర్ వుందని, 2వ శతాబ్ది బౌద్ధశిల్పాల్లో (అమరావతి) మొదటి కార్టూన్ పుట్టిందని చెప్పుకుని లాభం లేదు.

దామియర్‌ను, తలిసెట్టి రామారావునీ తలుచుకుని ప్రయోజనం లేదు. కార్టూన్‌కి సరికొత్తదనం, సరికొత్త ప్రయోజనం కల్పించడంతోనే ఆధునిక వ్యంగ్య చిత్రకళ చరిత్ర మొదలు కావాలి. ఇందుకు మన తెలుగులో, తెలుగువారిలో చక్కని స్ట్రోక్‌లో ఆరంభించింది మాత్రం శ్రీ బాపు, శ్రీ చంద్ర.

కేరికేచర్, కార్టూన్‌లకి తగిన గమ్మత్తయిన 'ప్రొపోర్షన్', చురుకయిన 'ఎక్స్‌ప్రెషన్'లూ, ధారగా సాగిపోయే 'లైన్'... దానికి ప్రాణం ఇచ్చే 'స్ట్రోక్' తీరూ అత్యవసరమైన అతిసహజమైన 'ఓనమాలు' అని గుర్తించి బాపు, చంద్రల కార్టూన్‌లు చూస్తే ప్రతి స్టూడెంటు కుర్రాడూ అర్థమవక మానదనిపిస్తోంది.

ఆ వెంటనే, అలా సరసరా చంద్రలాగా బొమ్మలు లేక కార్టూన్‌లు గియ్యడం గొప్ప అసాధ్యంరా బాబోయ్ అనిపిస్తుంది పిల్లలకి. చంద్ర ఎన్నివేల బొమ్మలువేశారో అన్ని వందల కార్టూన్‌లు గీశారు. దాదాపు అచ్చువని పత్రిక లేదు. అవి తెలీని తెలుగువాడు లేడు.

నిజానికి చంద్రని ఒకనాడు చూసి అసలు ఏ మాత్రం నవ్వకుండా కేవలం సీరియస్సు కథలు రాస్తూ బొత్తిగా గంభీరమైన బొమ్మలే గీస్తారనిపించింది. చంద్ర తన తీరయినా కనుముక్కు గడ్డాలు ఒక్కసారి బోల్డనిపిస్తూ గట్టిగా నవ్వగానే ఓహో ఈయనగారు కార్టూన్‌లు వేసారు గదా... అయితే నవ్వే బాపతే అని అర్థమైంది.

కానీ ఒకటి నిజం.

చంద్ర పెయింటింగ్ చేసేటప్పుడు, ఇలస్ట్రేషన్, ఎచింగ్, స్కెచింగ్ పత్రిరాలు చేసేటపుడు మంచి గంభీర ముద్రలో వుంటాడు. వేలాది దేశవిదేశీ కార్టూన్‌లు చంద్ర రెండో ఎక్కం చెప్పినంత గడగడా స్మరించుకోగలడు.

పక్కా విదేశీ సరుకువంటి విదేశీ హ్యూమర్‌ని ప్రాంతీయం చేయగల సత్తా, దమ్మూ చంద్రకి బలంగా వుంది.

ఓర్పుగల డాక్టరు అందరికీ శాంతంగా సమానంగా ఇంజెక్షన్ ఇచ్చినట్టు... చర్మం తీరుని బట్టి కార్టూన్‌లు సరఫరా చేసేవాడు చంద్ర.

'చంద్ర లైను', 'చంద్ర స్ట్రోక్' అంటూ పోటీ పడిన అనేకమంది తెలుగు యువకులు మంచి కార్టూనిస్టులు కాలేకపోవడం వల్ల క్రమంగా 'ఇలస్ట్రేషన్స్'లోకి దిగారు. స్థిరపడ్డారు.

ఆ వైనం నేటి పత్రికలు తిరగేస్తే ఇట్టేకనిపిస్తుంది. చంద్ర కార్టూన్ శైలిని అనుకరించడం అంత కష్టం అని తాత్పర్యం.



మాండలి సంగీతం వింటూ, డ్రాయింగ్ పేడ్ మీద పాలమీగడలాంటి తెల్లటి కాగితం మీదకి ప్రశస్తమైన సిగరెట్ పొగ గుప్పుమని వదుల్తూ సరసరా 'నిబ్' తోనో, పట్టి బ్రష్‌తోనో క్రొక్విల్, పెన్సిల్– ఏది వుంటే దానితో కార్టూనో ఇలస్ట్రేషనో గీసే చంద్రకి 'పనివేళ'లుండవు.

అర్ధరాత్రి, అపరాత్రివేళ అత్యవసరమని అబద్ధాలు చెప్పి చంద్ర నుంచి ఇలస్ట్రేషన్, కార్టూన్‌లు గైకొన్నవారు ఎందరో వున్నారు.

వారితో సహా తెలుగు పత్రికల నిర్వాహకులకి అనేకానేక చంద్రకార్టూన్‌లు కంఠతా వచ్చు.



## పాతతరం హాస్యాన్ని ఈ తరం వాళ్ళకి పరిచయం చేయడమే ఈ నాటి నవ్వులు...




# ఓటు దండకము

**–గోల్కొండ పత్రిక సంపాదకులు**

క॥ నీవే తల్లివి దండ్రివి
నీవే నా తోడునీడ; నిజముగ సఖుడా
నీవే గురుడవు దైవము
నీవే నా గతివి పతివి నిజముగ ఓటర్!

శా॥ లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె, తనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
ఓటే తప్ప యితఃపరం బెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే వోటర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా–

**దండకము**

మహా భాగ్యనగరాన మా పూర్వపుణ్యాన మేమెన్నియో యేండ్లు మాడంగ మాడంగ మా బాల్యమున్ యౌవనత్వంబు మా ప్రాయముల్ పంనో దారుఢ్యముల్ క్రుంగుచున్‌పోయి వృద్ధాప్యమున్ పొంది వెండ్రుకల్ తెల్లనై ముప్పయారేండ్లు అటుగడ్చి ఇటు గడ్చి ఈనాటికిన్నచ్చె. యా కొత్త ఖానూను మా గోర్కె లీదేర మా జన్మముల్ ధన్యతన్ బొందె నో ఖల్కియా శాసనంబో ఇదే నీకు వేవేల దణ్ణాలు దైకొమ్ము తల్లీ వినో ఓటరా–

మూడేండ్ల (ఐదేండ్ల) కోసారి నీ పాదపద్మంబులం గొల్చి నిన్ను నే దలచెదన్ నిన్ను నే పిలిచెదన్ నీ కటాక్షంబునన్ జూడవే దాతవై బ్రోవవే దగ్గిరన్ నిల్వవే స్వామి నిన్నెంచ నే నెంతవాడన్ దయా దృష్టి వీక్షింపవే ఓటు నాకిచ్చి నన్నెట్టులైనన్ సదా యా కమిటీకి మెంబర్నుగా జేసినన్ జాలు నా వంశమున్ దేశమున్ ధన్యతం బొందు ఆ మీద నా పూర్వపుణ్యంబు నా దాతవత్వంబు– నా భావి భాగ్యంబు నా తంత్ర నాదంబు సర్వంబుగా నున్నదో ఆ నిచ్చెనంబట్టి ఎంతైన పై ట్రికి ఎగబ్రాకగా వచ్చు ఎన్ని హోట్ హోముల్లైనన్ భుజింపంగ అటంకము ల్లేవు. రాజమాన్యుండుగా వచ్చు పేదసాదల్ భయంబంద అటు తిర్గి ఇటు తిర్గి ఎంతెంత పేరైన నే పొందగావచ్చు కొద్ది యుద్యోగులన్ శక్తి యున్నంత పెద్దించగా వచ్చు వీలుగా నున్నచో కొద్ది మేల్జేసి షాబాషు షాభాసు అనిపించుకోవచ్చు పెక్కైన లాభాలు సాధించుకోవచ్చు కాబట్టి యెట్టైన నీ ఓటుతో గూడ బంధుమిత్రాది వర్గంబు ఓట్లన్ని నాకు నిప్పింపవమా నన్ను రక్షింపుమా లేమి పోగొట్టుమా దీనునిన్ బ్రోవగా దిక్కు నీవే గదా నీవే కులం బందు జన్మంబుగానీ నీ స్పర్శ నీ రూపు నీ తీరు మొదలైన నీదే సమస్తంబు అస్పృశ్యమౌ గాని సాక్షాత్ పరబ్రహ్మ రూపంబుగా నుండు నీ ఓటు మాత్రంబె నిత్య సంపూతమై నెగడు లోకంబులన్ సంసారమున్ బాసి సౌఖ్యంబులన్ రోసి నిద్రాహారంబులన్ నీతి నియమంబులన్ నిత్యకృత్యంబులన్ మాని సర్వంబు వర్జించి యోగీశ్వరుంబోలి నీ దీక్షతో నుండి నీ ఓటు వాంఛించెదన్ నిన్ను యాచించెదన్ ఓటే సమస్తంబు ఓటే ప్రశస్తంబు ఓటే మహాముక్తి ఓటే పరబ్రహ్మ తద్దారివైనట్టి ఓటర్ మహాదేవ నమస్తే! నమస్తే! నమః

(నోటు : కృష్ణా పత్రిక యొక్క పాత సంచికనుండి కొద్ది మార్పులతో గ్రైకొనబడినది. గోలకొండ పత్రిక సంపాదకుడు–గోలకొండ పత్రిక 24-5-1934)





# అవీ... ఇవీ... అన్నీ నవ్వే...!

బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం

### వృత్తి... ప్రవృత్తికి గల వారి పిల్లల పేర్లు

| | |
|---|---|
| టీవీ సీరియల్ నిర్మాత | - ఝాన్సీ,శ్రావణి, కళ్యాణి, చిట్టెమ్మ |
| రచయిత | - రచన, కవిత, వచనం |
| లెక్కల మాస్టర్ | - రేఖ, గీత |
| విద్యుత్ శాఖ | - విద్యుత్‌లత |
| పత్రికాధిపతి | -ప్రభ, జ్యోతి, స్వప్న |
| వస్త్రవ్యాపారి | -కాటన్‌కమల, నైలాన్ నళిని, పాలిస్టర్ పార్వతి |
| డాక్టర్ | -ఆరోగ్యం,శక్తి |
| రైల్వే అధికారి | -కృష్ణ,సింహాద్రి,గోదావరి |
| సిమెంట్‌కంపెనీ యజమాని | -ప్రియ, నాగార్జున, అంజలి, భీమా |
| నీటి ప్రాజెక్టులు | -యమున, గంగా, కావేరి |
| పురోహితుడు | -నక్షత్ర, శుభ, అనూరాధ, భరణి |
| ఆర్.టి.సి. ఉద్యోగి | -ఇంద్ర, గరుడ |
| బంగారం వ్యాపారి | - అపరంజి, స్వర్ణ, రజిత |
| పూల వ్యాపారి | -రోజా, మల్లిక, చామంతి |
| పాల వ్యాపారి | -విజయ, తిరుమల, సంగం |
| ధాన్యం, విత్తనాల వ్యాపారి | -నీరజ,సుఫల |
| మ్యూజిక్ డైరెక్టర్ | -సంగీత, గీత, లయ,శృతి, పల్లవి |
| స్వీట్‌షాప్ ఓనర్ | -జహంగీర్, బాద్‌షా,కాజా |



### వేలంప్రకటన

ఈ మధ్య ప్రముఖుల వస్తువులు వేలం(వెర్రి) వెయడం ఫ్యాషన్ అయిపోయింది కదా? కొత్తగా జాబితలో మేము చేర్చిన ఈ వస్తువులు ఎంతకి అమ్ముడవుతాయో చూద్దాం!

- పాత 'మాయాబజార్' చిత్రంలో ఘటోత్కచుడు తినగా మిగిలిన ఆహార పదార్థాలు
- 'లవకుశ' సినిమాలో అంజలీదేవిని అడవికి తీసుకెళ్ళిన రథం
- 'దొరికితే దొంగలు' చిత్రంలో ఆకాశంలో విహరించే కారు
- 'రాజు-పేద' చిత్రంలో ఎన్.టి.ఆర్. తొడిగిన చిరుగుల చొక్కా
- 'శివ' సినిమాలో నాగార్జున వాడిన సైకిల్ చైన్
- 'ప్రేమ్ నగర్' సినిమాలో రాజబాబు కట్టుకున్న బంగ్
- 'దేవదాసు' చిత్రంలో నాగేశ్వరరావు మందుతాగిన గ్లాసు
- 'గుండమ్మకథ' చిత్రంలో రామారావు పిండి రుబ్బిన రోలు-రోకలి
- 'యమగోల' సినిమాలో జయమాలిని వాడిన డ్రస్
- 'పాతాళభైరవి' లో మహిమ గల విగ్రహం





చంద్ర
రాసిన కథ

# వెన్నెల ఆశ్చర్యపోయింది




**చె**ట్టు ఆకు సందుల్లోంచి ఓసారి తొంగి చూసి అతనొక్కడూ తప్ప మరెవ్వరూ లేరని నిర్ణయించుకుని అల్లరి చేయకుండా మెల్లిగా ఊడలా కిందకు దిగి అతని ముందు నుంచుంది వెన్నెల.

క్షణం కాలం నిశ్శబ్దంగా ఉండిపోయింది. అతనలాగే తన ఉనికిని కూడా గుర్తించకుండా చెట్టుకి ఒరిగి కళ్లు మూసుకుపోవటం ఆశ్చర్యం కలిగించింది.

మరో నిమిషం అలాగే వుండి తరువాత అతణ్ణి తట్టి లేపింది.

అతను కళ్లు తెరిచి తన ఎదురుగా ఆకుల మధ్యనించి నిలుచున్న వెన్నెలని, "ఎవరూ ?" అని అడిగేడు.

"నేను... వెన్నెలని!" అన్నది వెన్నెల సిగ్గుతో మెల్లిగా తలదించుకుంటూ.

వెన్నెల తలదించుకోవటం అతనికి నచ్చలేదు. వెనక్కి చెట్టు బోదెనానుకుని నిట్టూర్చేడు.

అతను నిట్టూర్చటం విని వెన్నెల తలెత్తి అతన్ని చూస్తూ అన్నది...

"పదిరోజుల్నుంచి చూస్తున్నాను. ఆవేదనతో నిట్టూర్చటం, లోలోపలే వెక్కి వెక్కి ఏడ్వటం తప్ప మీరు ఇంకేమీ చేయటం లేదు. - ఇన్నిటికీ, ఈ కాలమెవ్వరిదోవచ్చు! కారణాలు ఊహించేంత జ్ఞానం నాకు లేదనే నేననుకోవటం..."

క్షణం ఆగి ఓసారి అటూ ఇటూ చూసింది.

అతను అలాగే బోదెనానుకుని ఆశ్చర్యంగా వెన్నెలకేసి చూస్తూ అన్నాడు -

"అయితే నెల రోజులుగా నన్ను ఎవరూ కనిపెట్టటం లేదని పొరబడ్డానన్నమాట. నిజం! నాకింత వరకూ తెలీదు - నన్ను చూసే వాళ్ళు ఇంకొకళ్ళు వుంటారని. ఎందుకంటే నేననుకునే రాధిక మొన్నటి వరకూ నన్ను ప్రతి విషయంలోనూ కనిపెట్టి వుండేది. కాని దురదృష్టం, ఆమె నాకింక లేదు..."

ఈ సారి వెన్నెలకాశ్చర్యం వేసింది.

"నుంచునే వున్నావు కూర్చో!" అన్నాడతను.

వెన్నెల మాట్లాడలేదు.

"ఫరవాలేదు కూర్చో! ఎంతసేపని నుంచుంటావు."

వెన్నెల అతని ముందు పచ్చికలో ఒదిగి కూర్చుంది.

అతను కాళ్ళు చాచి చేతులు వెనక్కినెట్టి ఆకుల్లోంచి -వెలుగుతో ప్రకాశిస్తున్న చంద్రుడి వంక చూసేడు.

క్షణం ఏమీ మాట్లాడలేదు.

వెన్నెల అతని ముందు ముడుచుకుని పువ్వుల కుప్పలా, వెలుగు ముద్దలా తలొంచుకుని అతనికేసి ఓరగా చూస్తూ కూర్చుంది.

"చంద్రుడికి నువ్వులా, నాకు రాధిక వుందనుకునేవాణ్ణి..." అతనలాగే చంద్రుడి వంక చూస్తూ అన్నాడు.

వెన్నెల తలెత్తి అతనికేసి చూసింది.

"అవును. మొన్నటి వరకూ నేనూ, రాధిక అలాగే వుండేవాళ్ళం. ప్రపంచంలో నాకు రాధిక తప్ప మరెవ్వరూ లేరు..."

వెన్నెల అతనికేసి కళ్ళప్పగించి చూడ్డం అతనికి నచ్చలేదు.

"నిజమే! రాధిక అసలు ఎవరో చెప్పకుండానే నీకీ విషయాలన్నీ చెప్పడం పొరబాటే! రాధిక నాకు మేనమామ కూతురు. నాకు చిన్నప్పట్నుంచీ కూడా ఆత్మీయురాలిగా వున్నది కూడా ఒక్క రాధికే. నా తల్లిదండ్రీనే

బుద్ధెరక్కముందే నాకు దూరమయ్యారు. ఆ తరువాత ఇప్పటికీ నాకు మనిషిలా వుండి, బ్రతకడం నేర్పించింది రాధికే! అందుకే నాకు రాధి కంటే ప్రేమ. అసలు ప్రేమ ఏమిటో కూడా తెలియజెప్పిందీ... అదిదే!... నిజం! వెన్నెలా! నీకు తెలుసో... తెలీదోగానీ... నాకు బ్రతకటంలో కలలు కనడం నేర్పింది ఆమే...!"

"నాకప్పుడప్పుడూ అనిపించేది. ఆ భగవంతుడే గనక ఎదురొచ్చి నీకీ ప్రపంచంలో ఏం కావాలని అడిగితే ఓసారి భగవంతుణ్ణి చూసి పిచ్చిగా గొంతెత్తి నవ్వాలని వుండేది. లేకపోతే... రాధికే నాకు ప్రపంచం అయినప్పుడు ఇంక నేనేం కోరుకుంటాననీ...?"

క్షణం ఆగి చటుక్కున నవ్వాడతను.

వెన్నెల ఉలిక్కిపడింది.

అతనెందుకు నవ్వేడో వెన్నెల కర్థం కాలేదు.

"ఇప్పుడనిపిస్తోంది. నిజంగా భగవంతుడిలా నన్నడిగినప్పుడు నేనలా ప్రవర్తించకుండా వుండాలని, గర్వంగా ఎదురు చెప్పకూడదని! కనీసం 'రాధికను నాకు దూరం చేయకు స్వామీ' అనయినా బ్రతిమాలాలని !" అంటూ అతను తలొంచుకున్నాడు.

అతనలా కన్నీరు కార్చటం వెన్నెలకి బాధ కలిగించింది.

"మీరిలా క్రుంగిపోవటం బాగోలేదు. మీకింతకన్నా ఏం చెప్పను?" అన్నది.

అతను కన్నీళ్ళు నిండిన కళ్ళని ఎత్తి వెన్నెలకేసి చూసేడు.




వెన్నెలకి సిగ్గేసింది.

తలతిప్పి చుట్టూ చూసింది.

"నాకు వేళయింది. మళ్ళీ కలుస్తాను - ఇలాగే రేపు! సెలవు" అంటూ లేచి ఆకుల్లోంచి చంద్రుడికేసి వెళ్ళిపోయింది వెన్నెల.



మర్నాడు -

మబ్బు కమ్ముకున్నప్పుడు

అసలు రావలసిన వేళకన్నా ఇంకాస్త ఆలస్యం అయింది - వెన్నెలకి చెట్టు కిందకు వొచ్చేందుకు !

తననుకున్నట్టుగా అతను ముందు రోజులా చెట్టుబోదెనానుకుని లేడు.

పది రోజులుగా అలవాటుపడిన వ్యక్తి ఆ వేళప్పుడు అక్కడ కూర్చుని లేకపోవటం వెన్నెలకి ఆశ్చర్యం కలిగించింది.

ఓసారి చుట్టూ కలయజూసింది.

చెట్టుకి తూరుపు వేపు కాలవొడ్డున ఇసకలో వెల్లకిలా, ఆకాశంలో చంద్రుడిలో తన ఆలోచనల నీడల్ని వెదుక్కుంటూ పడుకున్న అతను కనుపించేడు.

వెన్నెలకప్పుడు-అతనక్కడ ఇసకలో పడుకున్నందుకు ఆశ్చర్యం కన్నా యింకేదో అనిపించింది.

అందుకే -

"అరె! మీరు ఇక్కడున్నారా ?" అని అన్నది.

అతను వెన్నెల పలకరింపుకు లేచి కూర్చున్నాడు. ఆ మాట అతనికి ఆ కాలవ నీటికి పుట్టే గలగలల శబ్దంలా, సంగీతంలా వినిపించింది. ఆ శబ్దంలో-సంగీతంలో అతనికి వెన్నెల మాటలు కన్నా రాధిక మాటలే వినిపించాయి.

అతను లేచి కూచున్నంతలోపలే వెన్నెల ఇసకలోకి అతనికి దగ్గరగా వొచ్చి కూర్చుంది.

"పాత బ్రతుకు పాతచోటునే పాతి పెట్టేను. నీకీ రోజు మంచి శుభవార్త చెబుతాను వెన్నెలా! నిన్నసలు మనం మాట్లాడుకోకుండానే కాలం మనల్ని నిలదీసింది-నన్నూ రాధికను విడదీసినట్టు. అయినా మళ్ళీ నువ్వు వొచ్చావు.



విడిపోయిన నీకు లాగా మళ్ళీ రాధిక నాకు దొరికింది. నువు నమ్మవు గదూ! నిజం వెన్నెలా!

"రాధిక నాకు దూరమయిన మాట ఒక రకంగా అబద్ధమయ్యిందీ రోజున.... తనే చెప్పింది. లోకం కోసం, సంఘం కోసం తనా తన్ని పెళ్ళి చేసుకుందనీ చెప్పింది. మొన్నెప్పుడో నేను పట్నం వెళ్ళినప్పుడు యవ్వనంలో కాలుజారి చలపతికి దగ్గరయినందుకు పెళ్ళి చేసుకోవలసి వొచ్చిందనీ పశ్చాత్తాపపడింది.

"నువు నమ్మవుగానీ వెన్నెలా! రాధిక ఇవాళ ఎంత బాధపడిందనీ! నిజానికి చలపతిని పెళ్ళి చేసుకున్నదన్నమాటే కాని, నా మీదే తనకు ప్రేమ వుందనీ, తన జీవిత కాలం నా జీవన నావలోనే గడుపుదామన్నదే తన ఆలోచనట.

నిజంగా నాకే జాలేసింది. అప్పట్లో, ఆ పరిస్థితుల్లో ఎవరయినా అంతే చేస్తారేమో! ఏమో ఏమిటి ? నేనయితే అలాగే చేసేవాణ్ణి! రాధిక నన్ను కాదని చలపతిని పెళ్ళి చేసుకోవటం తప్పనిసరయింది. అందుకు నేనిప్పుడు బాధ పడటం లేదు..."

వెన్నెల నిశ్చేష్టితయ్యింది.

అతను చెప్పుకుపోతున్నాడు.

"మొదట నేను నమ్మలేదులే! కాని నిజంగా నా మీద తనకి ప్రేమ వున్నట్టూ, అందుకు నిదర్శనంగా తనని తాను సమర్పించుకునేందుకివాళ ఈ కాలవొడ్డుకి వొస్తానంది.



"నిజం వెన్నెలా! ఇన్ని సంవత్సరాలుగా నేను ఎన్నిసార్లనుకున్నాను- రాధిక యవ్వనంతో ఆడుకోవాలనీ... రాధిక మనసులో నిలిచిపోవాలనీ... రాధికలో లీనమయిపోవాలనీ... నా ఈ కలలన్నీ ఇవాళ ఈ కాలవొడ్డున నీ వెలుగులో తీరుతాయి.

రాధిక నా కోసం ఇంకాసేపట్లో ఇక్కడికొస్తుంది. నీకు రాధికను పరిచయం చేస్తానుగా! చూద్దువుగాని! నిన్నటి వరకూ నాది కాకుండా పోయిందన్న అందం ఇంకాసేపట్లో నా చేతిలో గులాబీ పువ్వయిపోతుంది. పిచ్చెక్కి రాధికను మోహావేశంతో కౌగిలించుకుంటాను. ఈ లోకంలో నా జీవితానికల్లా ఎక్కువయినా ఆనందాన్ని ఈ రాత్రి అనుభవిస్తాను. ఆమె యవ్వనాన్ని మధువులా తాగేస్తాను.... నన్ను నమ్ము వెన్నెలా! నేనంటం కాదుగాని... చూస్తావుగా..."

నవ్వుతూన్న అతడిని చూస్తూంటే వెన్నెలకి పిచ్చెక్కిపోయేలా అనిపించింది.

అటూ యిటూ చూసింది. అడ్డువొస్తూన్న మబ్బుని చూసి వెన్నెల చటుక్కున లేచి చంద్రుడికేసి పరిగెత్తి వెళ్ళిపోయింది.

ఎందుకో మబ్బుతునక అడ్డుతొలగనందుకు కాస్సేపు అతని గురించి కన్నా ఆమె గురించి - రాధిక గురించి ఆలోచించాలనిపించింది.

అగ్నిసాక్షిగా పవిత్రంగా పెళ్ళాడిన భర్తను కాదని, తన సర్వస్వం తన స్త్రీత్వం అర్పించిన భర్తను కాదని మరో మగాడికి దాసోహం అయ్యేందుకు సిద్ధపడిన ఆమెను తప్పకుండా చూడాలనిపించింది వెన్నెలకి!

మబ్బుతెర తొలగినప్పుడు రాధికను చూడాలన్న ఆత్యంతాశతో నేలకేసి పరుగెత్తి వెళ్ళి, కాలవొడ్డున అతనామెను గొంతు నులిమి చంపుతూండటం కనిపించి ఆశ్చర్యపోయింది వెన్నెల !

**(జ్యోతి జూలై – 1969 సౌజన్యంతో)**








నాకు నగలమీద మోజేంలేదు పిన్నీ-
నా మీదే ఆయనకి మోజు!


మనవడా..
నేన్నీ అంత వున్నప్పుడు...


ఎక్కడుయ్యా- మేకప్ మామా...!?
హీరోయిన్‌కింకా మేకప్ మొదలెట్టలేదూ? ఏ?


అమ్మాయిని
వెనకేసుకు
రావటంలో నీ
తర్వాతే నేనయ్యా!




**"అ**బ్బ! ఆ రంగు, రూపం ఎంత ముద్దుగా ఉందో, చూడముచ్చటగా వుంది. చూస్తుంటే మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తోంది. ఇలాంటిదాన్ని నేను ఇంతవరకూ చూడలేదు. కళ్ళు అలా నిలిచిపోయాయి, రెప్పవేయడం మరిచిపోయాను.

ముట్టుకుంటే మాసిపోతుందేమోనన్నట్లు ముందు వెనుకా ఎక్కడా చూసి కూడా వంక పెట్టేట్టుగా లేదనుకో. ఇంకా ఇలా ఎంత చెప్పినా తక్కువే దానిగురించి" అన్నం ముందు కూర్చుని మొదలు వర్ణింపుతోనే సరిపోతోంది ఆత్మానంద్‌కు.

"ఛీ! ఛీ! ఇదేమిటి ఎన్నడూ లేనిది ఎవరినో చూసి ఇంతలా వర్ణిస్తున్నారు, ఎవరా సుందరీ మణి? ఈయనకేమైనా వెర్రి లేవలేదుకదా!" అనుకుంది కాంత.

ఆమెకు ఆత్మానంద్ ప్రవర్తన, మాటలు చిత్ర విచిత్రంగా అనిపించాయి.



అందుకే "ఏం మాట్లాడుతున్నారో కాస్త అర్థమయ్యేట్లు చెబుతారా" అన్నది తానూ అన్నం ముందు కూర్చుంటూ.

అన్నీ తనకిష్టమైన వంటకాలే అయినా ముద్ద నోట్లో పెట్టుకునే సరికి ఇన్ని కబుర్లు చెబుతున్నారు. ఏమై వుంటుందబ్బా! ఆశ్చర్యంగా వుంది. మొత్తానికి ఇద్దరూ భోజనం ముగించారు.

"కాంతా! నాతో రా!" అంటూ ఇంటి ముందుకు తీసుకువెళ్ళాడు ఆత్మానంద్.

అక్కడున్న గోడమీదినుంచి పక్కింటిలోనికి చూపించాడు. అలానూ చూస్తూ వుండి పోయింది మునేళ్ళమీద. మిల మిలా మెరిసి పోతూ వుంది కొత్తకారు. ఆమె కళ్ళు చెమర్చ్కున్నాయి.

"అబ్బ! ఎంత బాగుందో బుజ్జిముండ, ముద్దొస్తోంది" అలానే చూస్తూ వుండి పోయింది.

"ఇక చాల్లే, వేళ్ళూ, కాళ్లూ నొప్పెడతాయి కానీ వచ్చేయ్" అన్నాడు ఆత్మానంద్.

అంటే ఇంతసేపూ వర్ణించింది దీనిసేనా తానింకేమిటో అనుకుంది. అతని మాటలు విననట్టుగా కాసేపు అలానూ చూస్తూ వుండి పోయింది కాంత.

అలా ఎంతసేపు చూస్తే మాత్రం ఏం లాభం తమది కానప్పుడు. ఎన్నాళ్ళనుండో కారు కొనుక్కుందామని అనుకుంటుంది కాంత. కానీ ఎక్కడ ఎప్పుడూ ఏవో ఖర్చులు, కారు కొనేంత డబ్బులు ఆదా చేయలేక పోతోంది. ఏ అప్పో సప్పో చేసి కొనడానికి నచ్చదు. తనే పోగుచేసిన డబ్బుతో కారు కొనాలన్నది ఆమె తాపత్రయం.

కాంత కలలు కంటుండగానే పక్కింట్లో ప్రత్యక్షమయింది కారు.

తనకెంత ఇష్టమో కారంటే ఆత్మానంద్‌కు తెలుసు. తనని ఉడికించడానికి అట్లా దానిని వర్ణించాడని అర్థమైంది కాంతకు.

"సరే! కాంతా! నువ్విలా చూస్తూ వుండు నీకు కారును చూడాలనిపించినప్పుడల్లా, నే వెళ్తున్నా" అంటూ వెళ్లిపోయాడు లంచ్‌కి వచ్చిన ఆత్మానంద్.

కొద్దిసేపు అక్కడే వుండి వెళ్లిపోయింది కాంత.

✦ ✦ ✦

కారంటే ఇప్పుడంతా మామూలు అయిపోయింది. చాలామంది కొంటున్నారు. కానీ తనలాంటి వారికి మాత్రం కష్టమే.

కానీ ఈ మధ్య కారు కొనాలనే కోరిక ఆలోచనల్లో నింపేశాయి. కానీ ఆత్మానంద్ సంపాదన అంతంత మాత్రమే. తాను ఏ ఉద్యోగం



చంద్రా! ఈ పేరు తెలియని కళాకారులు ఆంధ్రాలో ఉండరంటే అతిశయోక్తి కాదు. ఆ గీతలు రాతలు చూస్తే ఆర్టిస్టులకు, కార్టూనిస్టులకు వళ్ళు పులకరించిపోతుంటుంది. ఆ బొమ్మల్లో ఏం అందం... ఎంత కుదురు!

నేను బొమ్మలు నేర్చుకునే కొత్తలో ఒకవైపు చంద్ర బొమ్మలు పెట్టుకుని... మరోవైపు ఉత్తమ్ బొమ్మలు పెట్టుకొని నేర్చుకున్నాను. స్వయంగా ఆయనతో కలిసినప్పుడైతే నా ఆనందానికి అవధులు లేవు. ఒక పెద్ద ఆర్టిస్ట్ అన్న గర్వం ఏ కోశాన లేకుండా మనసువిప్పి మాట్లాడిన ఆయన తీరు ఇప్పటికీ నేను మరచిపోలేను. ఆయనతో కలసిన ప్రతిసారి ఓ మధురస్మృతిగా నా మనసులో చెరగని ముద్ర వేసుకుంది. అవన్నీ మరోసారి మననం చేసుకోవడానికి అవకాశమిచ్చిన హాస్యానందంకు నా ధన్యవాదాలు.

-ఎ.దయాకర్, హైదరాబాద్

చేయడం లేదు. ఈ రోజుల్లో ఇద్దరి సంపాదన వున్నా కాస్త డబ్బును స్టేటస్ మెయిన్‌టెయిన్ చేయడానికి వినియోగించవచ్చు. కాంత అలా ఒకదానివెంట ఒకటి అనుకుంటూ వుండగానే స్కూలునుండి పిల్లలు వచ్చారు.

"మమ్మీ! మేమొకటి చూశాము" అన్నారు రాగానే.

"ఏమిటది?" అన్నది తాను, "పక్కింట్లో కారుని" అన్నారు ముక్తకంఠంతో.

"అయితే ఏమిటి" చిరాకుగా అంది.

కానీ పిల్లలు వూరుకుంటేగా ఎంతసేపైనా అదే టాపిక్ మాట్లాడసాగారు.



ఇంతలో ఫోన్ మోగింది. వెళ్లి అందుకుంది కాంత. "హల్లో! కాంతా, నేను సాగరిని. మీ పక్కింటి వాళ్ళు కారు తీసుకున్నారట. కాస్త ఎంతో కనుక్కుని చెబుతావా, మేమూ తీసుకునే ప్రపోజల్‌లో వున్నాము. ఇలా తెలుసుకుంటూ వుంటే రకరకాలుగా తెలిసి ఓ ఐడియా వస్తుందని" అంటూ పలకరింపు ఏమీ లేకుండానే హుకుం జారీచేసింది. ఈ మాటలతో మరింత కుమిలిపోయింది కాంత.

"ఏమిటి ఏం మాట్లాడవు? నీకూ వాళ్ళకూ పడదా ఏమిటి కొంపదీసి, పోనీ ఫోన్ నెంబర్ అయినా ఇవ్వు. నేనే చేసి మాట్లాడతాను" అంటూ రెట్టించింది సాగరి.

నేను మాట్లాడకపోతే ఇంకా ఏం అంటుందోనని కాంత "అలాగేలే, కనుక్కున్న తరువాత నీకు ఫోన్ చేసి చెబుతాను" అంటూ మరో మాట లేకుండా టపీమని ఫోన్ పెట్టేసింది.

ఇదీ ఇప్పుడే కొనుక్కోవాలా, అదీ మళ్ళీ పక్కింటికారు ఎంక్వయిరీ చేసి. మళ్ళీ నాకు ఫోన్ చేసి అడగాలా, దానికీ తెలుసు, స్నేహితురాలుగా. మాటల సందర్భంలో తనకి కారంటే ఎంత ప్రేమో తెలుసుకుంది, తెలిసి ఏడిపిస్తున్నట్లే అనిపించింది కాంతకు.

సందు దొరికితే చాలు, అందరూ ఏదో ఒకటి అనాలని చూసేవారే.

పని చేయడానికి పనిమనిషి వచ్చింది కాబోలు, అలా నిలుచునే వుంది. కదలనైనా లేదు. దీనికేమొచ్చింది. ఏదో చెప్పాలని కాబోలు. "అమ్మా! పక్కింటి అమ్మగారు వాళ్ళు కారు తెచ్చారు, ఇప్పుడే చూసొచ్చిన, చాలా బాగుందమ్మా! నువ్వూ వెళ్లి చూసిరా" అంటూ మొదలెట్టింది.

"నువ్వొక్కదానివి తక్కువయ్యావు పక్కింటి వాళ్ల కారుగురించి చెప్పటానికి అనుకున్నాను. కానీ నువ్వూ చెప్పుకొచ్చావు, అని లోలోన అనుకుని "నీ పని చేసుకో పో. నాకు తీరిన పుడు చూసి వస్తాలే" అంది తన పరమ విసుగుని అణగదొక్కి మరీ.

"మమ్మీ! మేము పక్కింటికి వెళుతున్నాము. కాసేపు వాళ్లింట్లో ఆడుకుని వస్తాము. అట్లనే కారునూ చూడొచ్చు మళ్ళీ" అంటూ ఆగకుండా వెళ్లిపోయారు.

ఈలోగా ఆత్మానంద్ స్నేహితుల్ని వెంట బెట్టుకుని మరీ వచ్చాడు.

"కాంతా! ఇతను నా ఫ్రెండ్. కారు తీసుకుంటాడట. పక్కింటివాళ్ళు కారు తెచ్చుకున్నారు. అది చూపిస్తానని తీసుకువచ్చాను" వెళ్ళి చూపించి వస్తా, ఇంతలో నువ్వు కాస్త కాఫీ రెడీ చెయ్" అంటూ తనకో పని పురమాయించి మరీ వెళ్ళారు.

ఇంకా దాన్ని చూడటానికి వచ్చిన వారికీ సేవలు కూడా చేయాలా. ఇలా ఎంతమంది వస్తారో, ఇదంతా చూస్తూంటే కాంతకు కారంటేనే విరక్తి పుట్టింది. కొంతకాలం దాని ఊసే ఎత్తకూడదు అనుకుని కాఫీ పెట్టడానికి వంటగదివేపు వెళ్ళింది కాంత.



